

ఋగ్వేద పరిశిష్టంలోని

# విశుద్ధ లక్ష్మీ సూక్తము

(వైదిక వైజ్ఞానిక వివరణతో)



వివరణ :

**సుమ్నార్థి**

(డా. కోడూరి సుబ్బారావు)



గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ



# ప్రార్థన

ఓం ప్రజాపతే! న త్వదేతా న్యన్యో విశ్వా జాతాని పరి తా బభూవ ।
యత్కామాస్తే జుహుమ స్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణామ్ ॥

– ఋగ్వేదం (10-121-10)

వాక్యార్థం :

ప్రజాపతే! న త్వత్ తా ఏతాని అన్యః = సమస్త ప్రాణులకు పాలకుడవు, పోషకుడవునైన ఓ ప్రజాపతీ! నీ కన్న మరొక ప్రజాపతి రాజు మాకు లేడు.

విశ్వా జాతాని పరి తా బభూవ = నీవు ఉత్పన్నమైన సమస్త ప్రాణులను, పదార్థాలను ఆవరించి వాటిలో వ్యాపించి ఉన్నావు.

యత్ కామాః+తే జుహుమః+తత్ నః+అస్తు = మేము ఏ ఏ కోరికలతో నిన్ను ప్రార్థించుచున్నామో అందుకు తగినట్లు పురుషార్థంచేసి నీ కర్పించుచున్నామో అవన్నీ మాకు ప్రాప్తించును గాక!

వయం స్యామ పతయః+రయీణామ్ = మేము గో అశ్వ ధన ధాన్యాది వివిధ ధనములకు స్వాముల మగునట్లు చేసి రక్షించుము.

సరళార్థం : ఓ ప్రజాపతీ! సమస్త ప్రాణి పోషకా! ఉత్పన్నమైన సమస్త పదార్థాలను, ప్రాణులను ఎరుగగల ప్రజాపతి మరొకడు లేడు. నీ వన్నిటిని ఆవరించి, అన్నింటిలో వ్యాపించియున్న ఏకైక దేవుడవు. ఏ ఏ కోరికలతో మేము నిన్ను ప్రార్థించుచున్నామో, అందుకు తగిన పూర్ణప్రయత్నం చేస్తున్నామో అవన్నీ మాకు లభించునట్లు అనుగ్రహింపుము. మేము గో అశ్వ ధన ధాన్యాది వివిధ ధనములకు పతులము – స్వాములము అగునట్లు చేసి రక్షించుము.

O Lord of all creatures! None other than Thou excels all these and other created things. Thou are above all. Thou are supreme. May Thou fulfil all our cherished desires and may we possess bounteous wealth and other material things of the world.



ఋగ్వేద పరిశిష్టంలోని

# విశుద్ధ లక్ష్మీ సూక్తము

(వైదిక వైజ్ఞానిక వివరణతో)




వివరణ :

**సుమ్నార్థి**

(డా. కోదూరి సుబ్బారావు)



ముద్రణ - వితరణ :

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ**

వైదిక గ్రంథమాల : 64

# విశుద్ధ లక్ష్మి సూక్తము (వైదిక వైజ్ఞానిక వివరణతో)

ద్వితీయ ముద్రణ : ప్రతులు 1000
సృష్టి సంవత్సరము = 197,29,49,120
దయానందాబ్దము = 195
శ్రీ వికారి నామ సంవత్సరము, చైత్ర శు॥ పౌర్ణమి (హనుమజ్జయంతి)

మూల్యము : రూ. 20/- (తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

1) **గాయత్రీ ఆశ్రమ ట్రస్టు - ఆర్య సమాజము మేడిబావి,**
12-10-586/6, ఇందిరానగర్, రోడ్ నెం. 2,
వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061, సెల్ : 9848011073.

2) **డా॥ కోదూరి సుబ్బారావు,** వైదిక వానప్రస్థాశ్రమం,
హనుమాపురం P.O. భువనగిరి - 508 116,
సెల్ : 9908994084.

3) **ఆర్యసమాజము - సీతాఫలమండి,** సికింద్రాబాద్ - 500 061.
ఫోన్ : 27071816, 69990967, 9246174018.

4) **పం. మురళీ బ్రహ్మచారి,** జూలమ్మగుడి ఎదురుగా,
రెజిమంటల్ బజార్, సికింద్రాబాద్. ఫోన్ : 9441033702.

**డి.టి.పి. & ప్రింటింగ్ :**
**విక్రాంత్ ప్రింట్ హౌస్,**
వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.
ఫోన్ : 9705085608.

# విశుద్ధ లక్ష్మీసూక్తము అంటే

నేడు లోకంలో ప్రచురితమైయున్న లక్ష్మీసూక్తంలో 30కి పైగా శ్లోకాలున్నాయి. కాని ఋగ్వేద పరిష్ట గ్రంథాలను పరిశీలించి, చూస్తే కేవలం 16 శ్లోకాలే కనబడతున్నాయి. 'పరిశిష్టం' అంటే మిగిలియున్న భాగం అని అర్థం. ఇవి పరమేశ్వరుడు చెప్పినవి కావు. ప్రాచీన ఋషులు వ్రాసినవి. ఋగ్వేదంలో లక్ష్మిని (ధనాన్ని, ఐశ్వర్యాలను) గురించి చెప్పిన మంత్రాలు చాలా ఉన్నాయి. వాటిని అధ్యయన మనన చింతనలు చేసిన ఒక ప్రాచీన మహర్షి సామాన్య ప్రజలకు అర్థమయ్యే విధంగా లక్ష్మిని (ఐశ్వర్యాన్ని ఒక స్త్రీ గా కల్పన చేసి 15 శ్లోకాలుగా వ్రాశారు. ఫలస్తుతిగా 16వ శ్లోకం వ్రాశారు.

దీనిని వ్రాసిన ఋషి తన పేరు వ్రాసుకోలేదు. కనుక దీనిని ఒక అజ్ఞాత మహర్షి రచనగా పేర్కొనవలసి వచ్చింది. అనంతరం ఎవరో సంస్కృత విద్వాంసులు వారి సంప్రదాయానికి చెందిన భావాలతో మరికొన్ని శ్లోకాలు దీనిలో కలుపుతూ 37 శ్లోకాలుగా చేశారు. అవి పౌరాణిక లక్ష్మీదేవిగా మూర్తిగా మూర్తి పూజను ప్రేరేపించేవిగా ఉన్నాయి. అందుచే మేము వాటిని తొలగించి ఋషి వ్రాసిన 16 మంత్రాలకే మహర్షి దయానందుల వారి భాష్యానికి సరళార్థంగా వ్రాసి ప్రచురిస్తున్నాము. అందుచే దీనికి "విశుద్ధ లక్ష్మిసూక్తము" అని పేరుపెట్టటం జరిగింది.

- సుమ్మార్థి

(డా. కోడూరి సుబ్బారావు)

# భగ సూక్తమ్-ప్రాతః స్మరణ సూక్తమ్

1. ఓం ప్రాత రగ్నిం ప్రాత రింద్రం హవామహే
ప్రాత ర్మిత్రా వరుణా ప్రాత రశ్వినా
ప్రాత ర్భగం పూషణం బ్రహ్మణస్పతిం
ప్రాతః సోమ ముత రుద్రం హువేమ. (ఋ. 7-41-1)

2. ఓం ప్రాత ర్జితం భగ ముగ్రం హువేమ
వయం పుత్ర మదితేర్ యో విధర్తా
ఆధ్ర శ్చిద్యం మన్యమాన స్తురశ్చిద్
రాజాచిద్యం భగం భక్షీత్యాహ. (ఋ. 7-41-2)

3. ఓం భగ ప్రణేతర్ భగ సత్యరాధో
భగేమాం ధియ ముదవాదదన్నః
భగ ప్రణో జనయ గోభిరశ్వైర్
భగ ప్రన్నృభిర్ నృవంతః స్యామ. (ఋ. 7-41-3)

4. ఓం ఉతేదానీం భగవంతః స్యామ
ఉత ప్రపిత్వ ఉత మధ్యే అహ్నామ్
ఉతోదితా మఘవన్ త్సూర్యస్య
వయం దేవానాం సుమతౌ స్యామ. (ఋ. 7-41-4)

5. ఓం భగ ఏవ భగవా నస్తు దేవా
స్తేవ వయం భగవంతః స్యామ
తం త్వా భగ సర్వ ఇజ్జోహవీతి
స నో భగ పుర ఏతా భవేహ. (ఋ. 7-41-5)

6. ఓం సమధ్వరాయోషసో నమన్త
దధిక్రావేవ శుచయే పదాయ ।
అర్వాచీనం వసువిదం భగం నో
రథమివాశ్వా వాజిన ఆ వహన్తు ॥ (ఋ. 7-41-6)

7. ఓం అశ్వావతీ ర్గోమతీర్న ఉషాసో వీరవతీః
సదముచ్ఛన్తు భద్రాః ।
ఘృతం దుహాన విశ్వతః ప్రపీతా యూయం
పాత స్వస్తిభిః సదానః ॥ (ఋ. 7-41-7)

# పుస్తక నేపథ్యం

నేను చాలా కాలం క్రితమే లక్ష్మి, శాంతి సూక్తాలకు సరళార్థం వ్రాసి ప్రచురించటం జరిగింది. కొన్ని నెలల క్రితం మా సీతాఫలమండి ఆర్యసమాజంవారు కోరగా శాంతి సూక్తానికి వాక్యార్థం, వైజ్ఞానిక వివరణలతోను, ఆంగ్ల సరళార్థంతోను ఒక పుస్తకం వ్రాసియిచ్చాను. దానిని వారు 2000 కాపీలు ముద్రణ చేయించి ఉచితంగానే వితరణచేశారు. వాటిని చదివిన పెక్కురు సంతృప్తిచెంది ప్రశంసించారు. మాకును తృప్తికలిగింది. అదే పద్ధతిలో లక్ష్మిసూక్తానికి కూడా వ్యాఖ్య వ్రాస్తే బాగుంటుందని మా ఆర్య సమాజ మిత్రులు ఫోనులో కోరారు. స్త్రీలు శ్రావణమాసంలో వరలక్ష్మి పూజలు ఎక్కువగా చేస్తూవుంటారు, వారికి ఈ లక్ష్మిసూక్తంపైనా, హోమంపైనా శ్రద్ధ కలిగేటట్లు వ్రాస్తే బాగుంటుందన్నారు. ఇప్పటి వారంతా ఆంగ్లమాధ్యమంలో చదువుచున్నారు కదా! ఆంగ్లఅర్థంకూడా చేర్చితే బాగుంటుందన్నారు. ఈ విషయం నేను కొద్ది రోజులు ఆలోచించాను. లక్ష్మి సూక్తానికి దయానంద మహర్షిగారు వ్రాసిన సంస్కృతభాష్యం మరొకసారి చదివి చూశాను. నాకును వ్రాస్తే బాగానే ఉంటుందనిపించింది. ఆ ఆలోచన కార్యరూపమే ఈ చిన్న పుస్తకం.

'లక్ష్మి సూక్తం' వేదభాగం కాదు. ఋగ్వేద పరిశిష్టములోనిది. పరిశిష్ట గ్రంథాలు ఋషులు వ్రాసినవి. దీనిని వ్రాసిన ఋషి తనపేరు వ్రాసుకోలేదు. పరిశిష్ట గ్రంథాలలోనూ చాలా వేదజ్ఞానం ఉంటుంది. కనుకనే మన దయానంద మహర్షి దీనికి సంస్కృతంలో భాష్యం వ్రాసి 'పంచమహాయజ్ఞ విధి' గ్రంథంలో చేర్చారు. దీనిలో 15 శ్లోకాలు ప్రార్థన గాను, 16వ శ్లోకం ఫలస్తుతిగా వీటితో హోమంచేస్తే మంచిదనియు ఉంది. లోకంలో ప్రచలితమైయున్న 'శ్రీసూక్తం' లో ఈ 16 శ్లోకాలతో బాటు మరొక 21 శ్లోకాలు చేర్చబడి మొత్తం 37 శ్లోకాలున్నాయి. ఆ చేర్చిన శ్లోకాలలో లక్ష్మిని ఒక స్త్రీగా విష్ణువుయొక్క పత్నిగా, తనను పూజించేవారికి వరాలిచ్చే దేవిగా వర్ణింపబడివుంది. లక్ష్మి - ఐశ్వర్యం పూజలతో వచ్చేదికాదు. శ్రమించి సంపాదించుకోవలసింది. ఈ సూక్తంలోని మొదటి 15 శ్లోకాలు అదే విషయాన్ని నొక్కి వక్కాణిస్తున్నాయి.

లక్ష్మీసూక్తంలో భౌతిక విజ్ఞానం పెద్దగాలేదు. కాని వేదవిజ్ఞానం, వ్యాకరణ విజ్ఞానం చాలా ఉంది. నేడు లోకంలో గృహనిర్వహణ విద్యను హోమ్ సైన్సు (Home Science) అనీ, గ్రంథాలయ వ్యవస్థావిద్యను లైబ్రరీ సైన్సు (Library Science), అనీ రాజనీతిని (Political Science) అనీ అంటున్నారు కదా! మరి వేదవిద్యా, వ్యాకరణవిద్యా విజ్ఞానం ఎందుకు కాదు? లోకంలోని విజ్ఞానాల (Sciences) పరిధి సీమితం. కాని, వ్యాకరణ విజ్ఞాన పరిధి అనంతం. దానితో సర్వవిద్యా నిధులైన వేదాలను, వాటి వ్యాఖ్యాన గ్రంథాలైన ఋషులు వ్రాసిన అనేకానేక భౌతిక ఆధ్యాత్మిక విజ్ఞాన శాస్త్రాలను చక్కగా అర్థం చేసుకోవచ్చు. పరిశోధనలు చేసి మరెన్నో నూతనావిష్కారాలను రూపొందించవచ్చు. తరతరాలకు ఎన్నెన్నో సుఖ సాధనాలను సమకూర్చవచ్చు. అందుచేత ఈ వ్యాఖ్యను "వైదిక వైజ్ఞానిక వివరణ" అని పేర్కొనటం జరిగింది.

మంత్రాలకు ఆర్యవిద్వాంసులు వ్రాసిన ఆంగ్లానువాదం నాకు కనబడలేదు. ఒక మిత్రుడు (చి. పూర్ణచంద్రరావు) ఇంటర్నెట్‌లో ఒక వ్యాఖ్య ఉందని తెచ్చియిచ్చారు. అది చాలా వరకు వైదికంగా ఉంది. దానిని కొద్ది మార్పులు చేసి ఇందు చేరుస్తున్నాను. నేటి ఆంగ్లమాధ్యమ యువతకు అది ఉపకరిస్తుంది. ముద్రణ దోషాలు సవరించిన శ్రీ డి. గంగాధర్ ఆర్య, చి. పూర్ణచంద్రరావు గార్లకు, అందంగా ముద్రించి యిచ్చిన విక్రాంత్ ప్రింట్ హౌస్ వారికి, సహకరించిన వారికి, పాఠకులకు అందరికి నా ధన్యవాదములు.

ఈ పుస్తకాన్ని క్రీ.శ. 2015 సం॥లో సీతాఫలమండి ఆర్యసమాజమువారు వెయ్యి ప్రతులు ముద్రించి ఉచితంగా వితరణ చేసినారు. అవి పూర్తిగా అయిపోయినవి. కొందరు భక్తులు ఇంతటి మంచి రచన ఎప్పుడూ లభ్యమయ్యేటట్లు మీ "గాయత్రీ ఆశ్రమ ట్రస్టు" ద్వారా ముద్రించి విక్రయించమని కోరారు. అందుచే దీనిని ఇప్పుడు మేము ప్రచురించుచున్నాము.

- సుమ్మార్థి

(డా. కోడూరి సుబ్బారావు)



# విశుద్ధ లక్ష్మీ సూక్తము

వేదం ధనార్జనకు వ్యతిరేకం కాదు. అయితే, అది ధర్మమార్గంలో జరగాలంటుంది. అందుకు నిత్యం 'అగ్నే! నయ సుపథా రాయే' (యజు. 40-16) ఓ అగ్నీ! జ్ఞాన స్వరూప పరమేశ్వరా! మమ్ము ధనప్రాప్తికి సుపథమున మంచి మార్గాన నడిపించమని ప్రార్థించమంటుంది. మాలోని కుటిల ఆలోచనలను పోగొట్టమని మనసారా అర్థించమంటుంది. 'వయం స్యామ పతయో రయినామ్' (ఋ 10-121-10) - మేము నీ కృపవలన వివిధ ధనములకు పతులము - స్వాములము అగుదుముగాక! అని సంకల్పించమంటుంది.

ఉదయం నిద్రలేవగానే ప్రతివ్యక్తి భగవంతుని అనేక దివ్యగుణాలను స్మరించటంతో బాటు లోకంలోని సమస్త ఐశ్వర్యాలకు అతడే స్వామియనీ - అతడు సృజించనవేననీ గుర్తించాలి.

**ఓం శతహస్త సమాహర సహస్రహస్త సం కిర ।**
**కృతస్య కార్యస్య చేహ స్ఫాతిం సమావహ ॥**

- అథర్వవేదం (3-24-5)

"ఓ మానవులారా! మీరు నూరుచేతులున్నట్లు పలురకాలుగా ధర్మమార్గాన ధనము నార్జించండి. వేయి చేతులున్నట్లు ఆ ధనమును సత్పాత్రులకు దాన మొసగండి. లేదా పలురకాలుగా పరోపకార కార్యాలు చేయండి. చేసిన కార్యాల అనుభవంతో చేయవలసిన కార్యాలను సమన్వయ పరుచుకుంటూ సదా ఆత్మోన్నతి వైపు పయనించండి. మానవ జన్మను సార్థక పరుచుకోండి." అని వేదం ద్వార సృష్టికర్త సందేశం ఇస్తున్నాడు. కనుక మనం అలసత్వాన్ని బద్ధకాన్ని విడిచిపెట్టి పూర్ణ పురుషార్థం చెయ్యాలి. లక్ష్మీ దేవిని ఉపాసించి లక్ష్మీ కటాక్షాన్ని పొందాలి. లక్ష్మీ సంపన్నులం కావాలి. మరి ఎవరీ లక్ష్మీ దేవి?

నేటి లోక ప్రచలితమైన పురాణాలనుబట్టి క్షీరసాగర మథనంలో జనించి విష్ణు దేవునకు పత్నియైన ఒక స్త్రీదేవత లక్ష్మి. ఆమె సమస్త ఐశ్వర్యాలకు స్వామిని. నాలుగు చేతులు కలిగి తన భక్తుల నైశ్వర్యాలతో ఆశీర్వదించుచుండు వరదాయిని. కాని మన ప్రాచీన వైదిక సాహిత్య కథనం ఇందుకు భిన్నంగా ఉంది. అది ఏమిటంటే-

## 'లక్ష్మీ' పద నిర్వచనం

లక్ష్మీ పదము – **'లక్ష దర్శనాఙ్కనయోః'** అను సంస్కృత మూల ధాతువు (Root) తో నిర్మితమయ్యింది. కాన మూలార్థాన్ని బట్టి "దర్శించునది, దర్శింపబడునది, దర్శించ దగినది" అను అర్థాలు వస్తాయి. సమస్త బ్రహ్మాండాలను, అందలి సమస్త స్థూల సూక్ష్మ ద్రవ్యాలను, ప్రాణులను దర్శించగల శక్తి కేవలం సృష్టి స్థితి లయముల గావించు పరమాత్మునికే ఉంది. కానరాని అత్యంత సూక్ష్మమైన ప్రకృతిని (పరమాణువులను) తన అనంత జ్ఞాన సామర్థ్యాలతో దర్శింపబడు ఈ ప్రపంచంగా నిర్మించినవాడు కూడా అతడే. కావున ఈ లక్ష్మీపదము ముందుగా పరమేశ్వరునికే వర్తిస్తుంది. అందుచేతనే మహర్షులు లక్ష్మీపదమును ఈ క్రింది విధంగా నిర్వచించారు.

**'యో లక్షయతి పశ్యత్యఙ్క్తే చిహ్నయతి చరాచర జగదథవా వేదై రాప్తైర్యోగి భిశ్చ యో లక్ష్యతే స లక్ష్మీః సర్వప్రియ ఈశ్వరః'** మహర్షి దయానందుల వారు ఈ నిర్వచనాన్ని వివరిస్తూ ఈ విధంగా అన్నారు. "చరాచరమగు సమస్త జగత్తును జూచువాడు, దృశ్యంగా చేయువాడు; శరీరమందు కన్ను, ముక్కు మొదలగువానిని, వృక్షములందలి పత్ర పుష్ప ఫల మూలాలను, భూ జలముల నలుపు ఎరుపు తెలుపులను, మృత్తికా పాషాణ చంద్ర సూర్యాది దృశ్యాలను జేయువాడును, అన్నిటిని జూచువాడును, సుందరము లన్నిటిలో అతి సుందరము, వేదాది శాస్త్రములకును, ధార్మికులు విద్వాంసులునగు యోగులకు లక్ష్యమును – చూచుటకు యోగ్యుడు నగుటచే పరమేశ్వరునకు 'లక్ష్మి యని పేరు' అని తన ప్రసిద్ధ 'సత్యార్థ ప్రకాశమున' తెలిపారు. ఐశ్వర్యము లన్నిటికి మూలకారణమగు సమస్త విద్యా విజ్ఞాన భండారమైన వేదాల నుత్పన్నము చేసినవాడు కూడ పరమేశ్వరుడే. గాన ఈ పదమునకు ఆధ్యాత్మికార్థం ఇదే. అంటే సర్వవ్యాపక సర్వేశ్వరునకుగల అనేక నామములలో 'లక్ష్మీ' నామము ఒకటి.

ఆధి భౌతికంగా అనగా ప్రాణుల పరంగా లక్ష్మిగల ఐశ్వర్యవంతులకు, రాజులకు ఈ పదము వర్తిస్తుంది. ఇక ఆధిదైవికార్థంగా అనగా జడదేవతల పరంగా అర్థం చెప్పుకుంటే దర్శించ తగినది, సుందరమైనది అందరికీ మనోరంజకమైనది ఐశ్వర్యం కాకున్న మరేముందును? కాన భౌతిక సిరిసందలనన్నిటిని లక్ష్మి అనవచ్చును. లక్ష్మి అనగా ధన కనక వస్తు వాహనాలే గాక గో అశ్వ గజ రాజ్యాదులన్నీ వస్తాయి. భూలక్ష్మీ, గోలక్ష్మీ, సంతానలక్ష్మీ.... మొదలైన

సంపదలన్నిటినీ లక్ష్మి పదంతో వ్యవహరించటం కనబడుతుంది కదా! లక్ష్మీ సూక్తంలో ఐశ్వర్య లక్ష్మి కొరకు జాతవేద భగవానుని ప్రార్థించటం కనబడుతుంది. మరి –

## ఈ 'జాతవేదు' డెవరు ?

'జాతవేదు' డంటే జన్మించినవాని నన్నిటిని ఎరిగినవాడని అర్థం. పుట్టిన ప్రతిప్రాణినే గాక ఈ సమస్త బ్రహ్మాండాలను సమస్త గ్రహ గోళాలను, అందలి సమస్త పదార్థాలను యథార్థంగా ఎరిగిన వాడని గ్రహించాలి. ఏలనంటే, అవన్నీ పుట్టినవే కదా! పరమాణువులతో నిర్మింపబడినవే కదా! వీటన్నిటిని ఎరుగగలవాడు పరమేశ్వరుడు కాక మరెవ్వరుంటారు? అందుచే సర్వవ్యాపకుడై జీవుల కొరకు సదా సృష్టి స్థితి ప్రళయాలను చేస్తూ, మానవులు తమ మనో వాక్కాయాలతో చేసే సమస్త కర్మలకు న్యాయంగా తగు ఫలాలనిచ్చే పరమేశ్వరునకే 'జాతవేదు' డనిపేరు.

సృష్టిక్రమంలో చివరి ప్రాణిగా పరమేశ్వరుడు మానవులను సృజించి వారికి 'బుద్ధి'యను ఒక గొప్ప అంతరింద్రియాన్ని ఇచ్చాడు. దానికి విషయంగా వేదాలద్వార జ్ఞానాన్ని ఇచ్చాడు. ఏ కర్మలవల్ల మానవులు ఇహలోక పరలోకాలలో ఉన్నతి చెందగలరో ఆ వేదాల ద్వారా ఉపదేశించాడు, అందు ఐశ్వర్యప్రాప్తికి వలయు ఎన్నెన్నో విద్యలను, విజ్ఞాన విషయాలను తెలిపాడు. సోమరితనాన్ని విడిచి పూర్ణ పురుషార్థంతో "శతహస్త సమాహర – సహస్రహస్త సంకిర" – నూరు చేతులతో సంపాదించి – వెయ్యి చేతులతో వితరణ చేయుమని ప్రబోధించాడు. అనగా శతవిధాల ధర్మకార్యాలలో వినియోగించి పుణ్యాన్ని ఆర్జించమని అర్థం. కాని ఆ సంపాదన వితరణలు ధర్మమార్గాన జరుగకున్న ఆ లక్ష్మి 'భద్రాలక్ష్మీ' కాదు. పాపీ లక్ష్మి అవుతుంది. ఆ పాపీ లక్ష్మి ఈ జన్మలో కాకున్నా రాబోవు జన్మలలోనైనా మిమ్ము కష్టాల పాలు చేయక విడువదు. 'తస్మాత్ జాగ్రత!' అని హెచ్చరించాడు.

కాన వేదోక్త ధర్మమార్గాన పూర్ణ పురుషార్థం చేసి భద్రాలక్ష్మిని పొందుదము రండు. అట్టి శక్తి యుక్తులను, పురుషార్థ ప్రేరణను కలిగించు మని మహర్షులు సూచించిన 'లక్ష్మీసూక్త' మంత్రాలతో జాతవేద పరమేశ్వరుని ప్రార్థింతము రండు.

## అష్టలక్ష్ములు

లోకంలో 1) ఆదిలక్ష్మి 2) ధాన్యలక్ష్మి 3) ధైర్యలక్ష్మి 4) గజలక్ష్మి 5) సంతానలక్ష్మి 6) విజయలక్ష్మి 7) విద్యాలక్ష్మి 8) ధనలక్ష్మి – అని 8

సంపదలను అష్టలక్ష్ములుగా రూపకల్పన చేసి, మూర్తులను నిర్మించి షోడోపచారాలతో పూజించటం జరుగుచున్నది. వీటికి వేరు వేరు స్తోత్ర పాఠాలు కూడా ఉన్నాయి. ఇది సరియైన పద్ధతికాదు. ఇక పరమేశ్వరీయమైన వేదం చెప్పే అష్టలక్ష్మ లేమిటో తెలుసుకుందాము.

**ఓం స్తుతా మయా వరదా వేదమాతా ప్రచోదయంతాం పావమానీ**
**ద్విజానామ్ ఆయుః ప్రాణం ప్రజాం పశుం కీర్తిం ద్రవిణం**
**బ్రహ్మవర్చసమ్ మహ్యం దత్త్వా వ్రజత బ్రహ్మలోకమ్ ॥**

- అథర్వవేదం (19-71-1)

ద్విజులను అంటే విద్యాగర్భాన్నుండి రెండవసారి జన్మను పొందిన విద్యావంతులను - స్నాతకులను పవిత్రపరిచే వేదమాత నాకు 1) ఆయుః = దీర్ఘమైన ఆయువును, 2) ప్రాణం = బలమైన ప్రాణశక్తిని, 3) ప్రజాం = ఉత్తమమైన సంతానాన్ని, 4) పశుం = గో అశ్వాది పశుసంపదను, 5) కీర్తిం = నా చే సత్కర్మలు చేయించి సత్కీర్తిని, 6) ద్రవిణం = పుష్కలమైన ధనాన్ని, 7) బ్రహ్మవర్చసమ్ = వేదజ్ఞానంతో పదును పెట్టబడిన బుద్ధిని - బ్రహ్మవర్చస్సును, మహ్యం దత్త్వా = నాకు ఈ లోకమున కలిగించి, 8) వ్రజత బ్రహ్మలోకమ్ = శరీర పతనానంతరం నన్ను బ్రహ్మలోకాన్ని - ముక్తి ధామాన్ని చేర్చునుగాక !

అని వేదం సంకల్పించమంటుంది. అందుకొరకు పూర్ణప్రయత్నం చెయ్యమంటుంది. వీటినే అష్టలక్ష్ములుగా వేదం చెబుతుంది. వీటినే కొందరు

**శ్లో॥ సిద్ధలక్ష్మీ ర్మోక్షలక్ష్మీ ర్జయలక్ష్మీ స్సరస్వతీ।**
**శ్రీలక్ష్మీ ర్వరలక్ష్మీ లక్ష్మీశ్చ ప్రసన్నా మమ సర్వదా ॥**

సిద్ధలక్ష్మి, మోక్షలక్ష్మి, జయలక్ష్మి, సరస్వతీ (విద్యాలక్ష్మి), శ్రీలక్ష్మి, వరలక్ష్మీ మొదలైన పేర్లతో పిలువబడు లక్ష్ములు - అనగా సంపదలు నాకు ప్రసన్నం కావాలి - అవి నాకు లభించాలి అని ప్రార్థిస్తారు.

స్త్రీ పురుషు లిరువురికి ఈ సంపదలు అవసరమే. కనుక లక్ష్మీసూక్తాన్నీ అందరూ పఠించవచ్చు. వరలక్ష్మీ హోమాన్ని అందరూ చేయవచ్చు. అందుకు ప్రమాణాలు వేదాలలోను, ఋషుల గ్రంథాలలోను, రామాయణ భారతాది చరిత్ర గ్రంథాలలోను ఉన్నాయి. (అందుకు నా రచనలు గాయత్రీ విజ్ఞానం, గాయత్రీ మహిమ చదవండి.)



# అథ లక్ష్మీసూక్తమ్

ఓం హిరణ్య వర్ణాం హరిణీం, సువర్ణ రజత స్రజామ్ ।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమావహ ॥ (1)

<u>వాక్యార్థం :</u> <u>ఓ3మ్</u> = ఓ సర్వవ్యాపక సర్వసంరక్షక సర్వేశ్వర! ఈ పదము మంత్రంలోని భాగం కాదు. వేదసూక్తాలు కానీ, వేదమంత్రాలతో ప్రకరణాన్ని ప్రారంభించేముందు కానీ పరమేశ్వరుని ముఖ్యనామమైన ఓ3మ్ ను ఉచ్చరించి ప్రారంభించటం వైదికాచారం. అందుచే 'ఓ3మ్' చేర్చబడింది.

<u>హిరణ్యవర్ణాం హరిణీం</u> = బంగారు వర్ణంతో కూడినదియు, దర్శనమాత్రాన సర్వజనుల చిత్తాన్ని హరించునదియు,

<u>సువర్ణ రజత స్రజామ్</u> = బంగారు వెండి మాలలను ధరించినదియు,

<u>చంద్రాం హిరణ్యయీం లక్ష్మీం</u> = చంద్రుని వలె ఆహ్లాదమును కలిగించునదియు, బంగారు మయమైనదియు నగు లక్ష్మిని - సంపదలను

<u>జాతవేదః + మమ+ ఆవహ</u> = ఓ జాతవేద భగవానుడా! మాకు ఆవాహన చెయ్యుము - ప్రాప్తింపచేయుము.

<u>తాత్పర్యం</u> : ఓ జాతవేద పరమేశ్వరా! సర్వ పదార్థ జ్ఞాతా ! చతుర్వేద ప్రదాతా ! సర్వవస్తు ప్రదాతా! సర్వవ్యాపక సర్వేశ్వర! బంగారు వర్ణంతో ఒప్పారునదియు, దర్శనమాత్రాన సర్వజనుల చిత్తము నాకర్షించు నదియు, సువర్ణ రజిత మాలాలంకృతయు, ఆహ్లాదము నిచ్చునదియు, హిరణ్యమయియునగు లక్ష్మిని - ఐశ్వర్యమును నాకు ప్రసాదింపుము.

<u>వైజ్ఞానిక వివరణ :</u> ఈ ఋషిప్రోక్త ప్రార్థనా మంత్రంలో పరమేశ్వరుని 'జాతవేదః' నామంతో సంబోధించటం జరిగింది. మనం పూర్వప్రకరణంలో తెలిసికొన్నట్లుగా జన్మించిన ఉత్పన్నమైన వాటినన్నిటిని తెలుసుకొనగలవాడు ఒక్కపరమేశ్వరుడు మాత్రమే. కనుక ఆధ్యాత్మికార్థంలో ఈ పదము సృష్టికర్తకే వర్తిస్తుంది. అయితే - అగ్నిహోత్ర ప్రకరణంలో 'జాతవేదః' కు భౌతికమైన 'అగ్ని' అని అర్థం వస్తుంది. వేదాంగాలలో ఒకటైన నిరుక్తశాస్త్రం (7-19) లో ఈ పదమునకు చాలా విశాలమైన అర్థాలు చెప్పబడ్డాయి. ఉత్పన్నమైన వాటిని అగ్ని తన ప్రకాశంతో మనకు కనబడేటట్టు

చేస్తుంది కదా! అందుకే అగ్నికి జాతవేదుడనే పేరు వచ్చిందట. ఇంతేగాక, ప్రతీ పదార్థంలోను అగ్ని తత్త్వం కొంత ఉంటుందట.

ఇక లక్ష్మిని గురించి ఆలోచిద్దాం. పూర్వప్రకరణంలో చెప్పుకున్నట్లుగా ఆధ్యాత్మికార్థంలో పరమేశ్వరునకు, ఆధి భౌతికార్థంలో ధనవంతులకు, ఆధి దైవికార్థంలో వివిధ సంపదలకు ఇది వర్తిస్తుంది. అయితే ఈ మంత్రంలో సువర్ణ రజత మాలాలం కృతమైన సుందర మనోహర స్త్రీ మూర్తిగా లక్ష్మి వర్ణింపబడింది. ఇది ఒక అలంకారిక వర్ణన – కల్పన. మనోహర స్త్రీ పట్ల పురుషుడు ఆకర్షింపబడినట్లే సంపదలపట్ల స్త్రీ పురుషులిరువురు ఆకర్షింపబడతారు. కనుక మానవుల చిత్తాన్ని హరించే సంపదలను నాకు ప్రసాదించుమని జాతవేద భగవానుని – సృష్టికర్తను ప్రార్థించటం జరిగింది.

God means Generator, Operator and Destroyer (Dissolver) of universe. His supreme name is O3M. This is the real name of God. Remainings are adjectives - Qualities, deeds natures etc. The root meaning of O3M is Protector of all - Samrakshak (సర్వసంరక్షకుడు) Guardian.

O Almighty God, Jataveda ! You alone know all the things created in the universe. You are imparter of supreme knowledge of vedas. Kindly invoke for me that Laxmi who is of Golden Colour, Beautiful and adorned with Gold and Silver garlands.

*(Gold represents Sun or the Fire of Tapas* (తపస్సు) *Silver represents Moon or the Bliss and Beauty - Pure Satwa Guna). (Invoke means Pray, Call on for aid or Protection).*(1)

ఓం తాం మ ఆ వహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ ।
యస్యాం హిరణ్యం విందేయం, గామశ్వం పురుషానహమ్॥ (2)

వాక్యార్థం : తాం మే+ఆవహ జాతవేదః = ఓ జాతవేద పరమేశ్వరా! అట్టి లక్ష్మిని – సంపదలను నాకు ప్రాప్తింప చేయుము. (మే అనే పదం తర్వాత 'ఆ' అక్షరం ఉండటం వల్ల అది హ్రస్వంగా 'మ' అయ్యింది.)

ఆ సంపదలు ఎట్టివన –

<u>లక్ష్మీమ్ + అనుపగామినీమ్ =</u> ఆ లక్ష్మి నన్ను విడిచి పెట్టక ఎప్పుడూ నా వద్దనే ఉండేదికావాలి.

<u>యస్యాం హిరణ్యం విందేయం గామ్ + అశ్వం + పురుషాన్ + అహమ్ =</u> అది నాకు సువర్ణ వజ్ర వైడూర్యాదులను, గోవులను, అశ్వాలను, బంధు బాంధవులను ప్రాప్తింప చేసేది కావాలి.

<u>తాత్పర్యం :</u> ఓ జాతవేదా! సర్వపదార్థ జ్ఞాతా ! చతుర్వేద ప్రదాతా ! ఐశ్వర్యదాతా! ఈశ్వరా! నన్నెన్నటికి విడువని గో అశ్వ సంపదలను, సుసంతానమును, పుష్కల సువర్ణాది సంపదలను నాకు ప్రసాదింపుము.

<u>వివరణ :</u> కొందరు పురుషార్థంతో పేదరికంనుండీ, మధ్య తరగతినుండీ పైకి ఎదుగుతారు. ధనవంతులౌతారు. అన్న వస్త్రాలకు, అవసరాలకు ఏ లోపం లేనంత ధనం ప్రాప్తించినా వారికి సంతృప్తి నివ్వదు. ఆశ పెరిగిపోతూ ఉంటుంది. అడ్డదారులు త్రొక్కుతారు. షేర్ మార్కెట్లో పెట్టి కొందరు, లాటరీలలో గుఱ్ఱపు పందాలలో పెట్టి కొందరు, ఆడబ్బును పోగొట్టుకొని మరల పేదవారౌతారు. మొదటినుండీ భాగ్యవంతులైన వారికి కూడా ఇంకా భాగ్యవంతులు కావాలని ఆశపడి అంతా పోగొట్టుకుంటారు. దొంగనోట్లు ముద్రించేవారు, స్మగ్లింగ్ చేసే వారు ఎక్కువ భాగ్యవంతులేనట.

ఇటువంటి పెడ బుద్ధులు పుట్టకుండా నేను పొందిన లక్ష్మిని నావద్దనే పెట్టుకొని కాపాడుకోగల సద్బుద్ధిని ప్రసాదించమని జాతవేద భగవానుని కోరటం ఈ మంత్రంలో జరిగింది. ఇది మొదటి ప్రార్థన.

<u>రెండవ ప్రార్థన :</u> పిసినారితనం పోగొట్టమని. కొందరు అనేక రకాలుగా డబ్బు సంపాదిస్తూ ఉంటారు. కాని, ఖర్చు పెట్టటానికి మనసొప్పదు. అంతా దాచి పెడుతూనే ఉంటారు. పరోపకారం చెయ్యటానికి మనసొప్పకున్నా కనీసం తాను సుఖంగా జీవించవచ్చుకదా! అట్టివారికి ఈ మంత్రం ఏమి సందేశమిస్తున్నదంటే – ఆ ధనం మాకు సువర్ణాది సుఖభోగాలను, గో సంపదను, అశ్వసంపదను కలిగించాలంటున్నది.

గోవుల వల్ల మనకెన్నో ప్రయోజనాలున్నాయి. అవే మనకు పుష్టితుష్టులను ప్రసాదిస్తాయి. అశ్వగజాదులన్నీ వాహనాలు – ప్రయాణ సాధనాలు, మోటారు కాలుష్యాలకన్న అవి ఎంతో మేలు. వాటిపై పయనించటం వల్ల మంచి వ్యాయామం

సిరి ఆరోగ్యం, బలం మరింత కలుగుతాయి.

O Jataveda Bhagavan! Invoke for me that Laxmi who does not go away, by whose Golden touch I will obtain Cattle, Horses, Progeny and Servants. (2)

ఓం అశ్వపూర్వాం రథమధ్యాం, హస్తినాద ప్రమోదినీమ్ ।
శ్రియం దేవీ ముపహ్వయే, శ్రీర్ మాదేవీర్ జుషతామ్ ॥ (3)

వాక్యార్థం : అశ్వపూర్వాం రథమధ్యాం = వాయువేగముగల అశ్వాలతోను అతిరథ మహారథులచే శోభిల్లుచుండు రథాలతోను,

హస్తినాద ప్రమోదినీమ్ = మదగజముల ఘీంకారాలతో కూడిన

శ్రియం దేవీమ్ + ఉపహ్వయే = శ్రీ దేవిని - రాజ్యలక్ష్మిని నేను ఆహ్వానించుచున్నాను - కోరుచున్నాను.

శ్రీర్ + మా దేవీర్ + జుషతామ్ = అట్టి శ్రీదేవి - రాజ్యలక్ష్మి సంతోషంగా నావద్దనే స్థిరంగా ఉండునుగాక !

తాత్పర్యం : ఓ జాతవేద భగవన్ ! వాయువేగంగల అశ్వాలతోను అతిరథ మహారథులతోను శోభిల్లుచుండు రథాలతోను మదగజముల ఘీంకారాలతోను కూడిన రాజ్యలక్ష్మిని నాకు ప్రసాదింపుము. నీచే నొసంగబడిన ఆ శ్రీదేవిని - ఐశ్వర్యదేవతను మనసారా నేను ఆహ్వానిస్తున్నాను. నీ అనుగ్రహం వల్ల ఆ లక్ష్మి సదా నా చెంతనే స్థిరంగా నుండుగాక!

వివరణ : విశ్వంలోని ఐశ్వర్యానికంతా రాజు పరమేశ్వరుడు. అది అతని సృష్టి అతని పాలన. అందుకనే వేదం దేవుణ్ణి 'ఇంద్రుడు'(ఇది ఐశ్వర్యే) అంటుంది. అతని ఆజ్ఞాపాలకులమై - వేదమార్గంలో మనం ఒక ధర్మరాజ్యాన్ని నిర్మించుకోవచ్చు. ఆ విధంగా సంపాదించుకున్న రాజ్యలక్ష్మిని కాపాడుకోవటమూ అవసరమే. లేకున్న శత్రువులు దోచుకుంటారు. ప్రజలను, రాజును కూడ తమ బానిసలను చేసుకుంటారు. అందుకు మన భారతదేశమే పెద్ద ఉదాహరణ. లక్షల కోట్ల సంవత్సరాలు ప్రపంచాన్ని ఏక ఛత్రాధిపత్యంగా ఏలిన మన రాజ్యాన్ని, రాజ్యలక్ష్మిని విదేశీయులు దోచుకున్నారు. మనను బానిసలనుచేశారు. కనుక ఆస్తి పాస్తులు సంపాదించటం ఎంత అవసరమో వాటిని రక్షించుకోవటం కూడా అంతే అవసరం. కనుక దేశంలో బ్రాహ్మ క్షాత్ర శక్తులు రెండూ సహచరులుగా ఉండాలంటుంది వేదం -

ఓం యత్ర బ్రహ్మా చ క్షత్రంచ సమ్యఞ్చౌ చరతః సహ ।
తం లోకం పుణ్యం ప్రజ్ఞేషం యత్ర దేవాః సహాగ్నినా ॥ యజు. (20-25)

చక్కగా ప్రీతితో ఏదేశంలో బ్రాహ్మీశక్తి, క్షాత్రశక్తి (వైశ్యాది ఇతరశక్తులు) కలిసి కృషి చేస్తాయో ఆదేశం అన్నిరంగాలలోనూ ఉన్నతి చెందుతుంది.

ఇట్టి వేదమంత్రాలు వేదాలలో చాలానే ఉన్నాయి. అదే విషయాన్ని ఈ లక్ష్మీ -సూక్త కర్త ఈ శ్లోకంలో ఉపదేశించుచున్నాడు. అశ్వ గజ బలాలతోను అతిరథ మహారథులతోను కూడిన రాజ్యలక్ష్మిని మాకు ప్రసాదించు. అది ఎప్పటికినీ మావద్దనే ఉంచుకొనగల శక్తియుక్తులను, బలపరాక్రమాలను మాకు ప్రసాదించమని జాతవేద భగవానుని కోరటం జరిగింది.

O Jataveda ! Invoke for me that Laxmi who is abiding in the chariot of Sri, which is driven by Horses in front and whose appearance is heralded by the trumpet of Elephants. Invoke the Devi who is embodiment of Sri nearer so that the Devi of Prosperity becomes pleased with me.

*(Chariot represents the Abode of Sri and Horses represent the energy of effort. The Trumpet of Elephants represents the awakening of Wisdom. Prosperity is the external manifestation of Sri and is therefore pleased when Sri is Invoked) (3)*

ఓం కాంసోస్మితాం హిరణ్యప్రాకార మార్ద్రామ్ జ్వలంతీం
తృప్తాం తర్పయన్తీమ్ ।
పద్మే స్థితాం పద్మవర్ణాం, తామిహోపహ్వయే శ్రియమ్ ॥ ...... (4)

వాక్యార్థం : కాంసోస్మితాం హిరణ్య ప్రాకారామ్ = కంచువలె ప్రకాశించు నదియు, హిరణ్య (సువర్ణ) ప్రాకారాలతో కూడినదియు,

ఆర్ద్రామ్ జ్వలంతీం తృప్తాం తర్పయన్తీమ్ = ఇంతేగాక, అది రాజ్యంలోని ప్రజలందరిని స్నేహయుక్తులను చేసేదిగాను, ఐకమత్యంతో ప్రకాశింప చేసేదిగాను, పోషించేదిగాను ఉండగోరుచున్నాను.

పద్మేస్థితాం పద్మవర్ణాం తామ్+ఇహ+ఉపహ్వయే శ్రియమ్ = పద్మవర్ణంతో పద్మాసనంలో స్థిరంగా కూర్చున్న రాజ్యలక్ష్మిని - చక్రవర్తి రాజ్యాన్ని మేము

కోరుచున్నాము.

<u>తాత్పర్యం</u> : ఓ జాతవేద పరమేశ్వరా ! ఓ సర్వైశ్వర్యదాత! కంచువలె ప్రకాశించునదియు, సువర్ణ ప్రాకారాలతో శోభిల్లునదియు, స్నేహయుక్తయు, తాను పరిపూర్ణయై యితరుల తృప్తి పరచునదియు, పద్మవర్ణంతో పద్మాసనమున (అనగా స్థిరంగా ఉండి) శోభిల్లునదియునగు రాజ్యలక్ష్మిని - చక్రవర్తి రాజ్యాన్ని మాకు ప్రసాదించుము.

<u>వివరణ</u> : మనకు లభించిన రాజ్యలక్ష్మి - చక్రవర్తి రాజ్యం ఎలా వుండాలో ఈ మంత్రం చెబుతున్నది. అది కంచు కోటవలె శత్రు దుర్భేద్యంగా ఉండటమే కాక ప్రజలను చక్కగా పాలించి పోషించేదిగా ఉండాలి. ప్రజలను స్నేహయుక్తులుగాను ఐక్యమత్యంగలవారిగాను తీర్చిదిద్దేది కావాలి.

పద్మాసనంలో పద్మవర్ణంతో దేదీప్యమానంగా ప్రకాశించే ఆ రాజ్యలక్ష్మి మావద్దనే స్థిరంగా ఉండాలనేది రెండవ ప్రార్థన. దీని భావమేమంటే రాజ్యాన్ని పాలించే రాజును విష్ణువంటుంది వేదం. అతను ఒక చోటనే ఉన్నా అతని శాసనం దేశమంతా వ్యాపిస్తుంది కనుక అట్టి విష్ణువుకు నాలుగు చేతులుండాలి. వాటితో శంఖ చక్ర గదా పద్మాలను ధరించాలి. ఇది ఒక అలంకారిక వర్ణన. శంఖ చక్రాలు క్షాత్రశక్తిని సూచిస్తాయి. వీటితో శత్రువులను ఎదుర్కొని రాజ్యాన్ని కాపాడాలి. గద - గృహమంత్రిత్వశాఖ. రాజ్యంలోని ప్రజలను అనుశాసనంలో పెట్టడానికి, దుష్టులను, దుర్మార్గులను దోపిడీగాండ్రను శిక్షించటానికి. నాల్గవది పద్మం. ఇది ఐశ్వర్యాన్ని, సంపదలను సూచిస్తుంది. అవి పద్మాసనం వేసుకొని కదలకుండా స్థిరంగా ఉండాలనీ, పద్మవర్ణంతో - సువర్ణ వజ్ర వైడూర్యాది ప్రకాశాలతో భాసిస్తూ ఉండాలనీ సూచిస్తుంది.

అట్టిరాజును విష్ణువనీ, అతనికి నాలుగు చేతులనీ, శంఖ చక్ర గదా పద్మధారియనీ పౌరాణికులు విష్ణువును కల్పించారు. అలాగే అతని సంపదలను 'లక్ష్మి' అన్నారు. ఈ లక్ష్మీసూక్త మంత్రాలు పేర్కొనే లక్ష్మీదేవి స్త్రీ దేవత కాదు. వివిధరకాల సంపదలనే లక్ష్మి అంటున్నాయి. (కొందరు ఈ మంత్రంలోని మొదటి పదం "కాం, సోస్మితాం" అనే రెండు పదములుగా విడదీసి అర్థాలు వ్రాశారు. 'కాం' అంటే ఎవరామె? అని అర్థం. అది ఇచ్చట సరిపోదు.

O Sarvaishwarya Pradata ! Greatest Donor ! Invoke for me that Laxmi who is having beautiful smile and who is enclosed by a soft Golden Glow, who is eternally satisfied and satisfies all those to whom she reveals herself. Who abides in the Lotus and has the colour of Lotus; Invoke that Laxmi here who is embodiment of Sri.

*(Beautiful smile represents the Transcendental Beauty of Sri, who is enclosed by the Golden Glow. Lotus represents Yogic Padmasana and Deep Meditation.) (4)*

ఓం చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం, శ్రియం లోకే
దేవజుష్టముదారాం ।
తాం పద్మనేమిం శరణం మహం ప్రపద్యే, అలక్ష్మీ ర్మే నశ్యతాం
త్వాం వృణోమి ॥ ... (5)

వాక్యార్థం : చంద్రాం ప్రభాసాం జ్వలంతీం = చంద్రుని వంటి ఆహ్లాదకర ప్రకాశాన్నిస్తూ దేదీప్యమానంగా వెలిగేది,

శ్రియం లోకే దేవ జుష్టమ్+ఉదారామ్ = లోకంలో దేవతలచే పూజలందుకునే కరుణా స్వరూపిణియైన ఏ ఐశ్వర్యదేవత ఉన్నదో

తాం పద్మనేమిం శరణం +అహం ప్రపద్యే = రథచక్ర మధ్య కుండము వలె వికసించిన పద్మమున పద్మాసినియైన ఆ మహాలక్ష్మిని నేను శరణు జొచ్చుచున్నాను.

అలక్ష్మీర్ +మే నశ్యతాం త్వాం వృణోమి = ఓ తల్లీ ! నా అలక్ష్మిని (దారిద్ర్యాన్ని) నశింప చేయుమని నిన్ను అర్థిస్తున్నాను.

తాత్పర్యం : ఓ జాతవేదా! పరమేశ్వరా! విద్యావిజ్ఞానాలతో ఆహ్లాదాన్నిచ్చునదియు, విశేష ప్రకాశం గలదియు, సర్వలోకాలందు గౌరవింపబడు నదియు, ఈ లోకంలో బ్రహ్మాది దేవతల (విద్వాంసుల) చేతను, మరీచ్యాది ఋషుల చేతను, మన్వాది రాజన్యుల చేతను సేవింపబడినదియు, ఉదారశీలయు పద్మనేమియునగు లక్ష్మిని - ఐశ్వర్యమును నేను శరణు జొచ్చుచున్నాను - కోరుచున్నాను. ఓ లక్ష్మి ! ఐశ్వర్యమా! నా దారిద్ర్యమును నశింపజేయ నిన్ను ప్రార్థించుచున్నాను.

వివరణ : ఇచట 'లక్ష్మి' సంబోధనను చేతన దేవతగా - స్త్రీగా తలంచకూడదు. ఐశ్వర్యం యొక్క విలువను గుర్తించి దానిని పొందుటకు పూర్ణపురుషార్థం చెయ్యాలి.

మహర్షి దయానందులవారు ఈ రకమైన సంబోధన దోషం కాదంటూ – "అచేతన్నేఽపి చేతనవద్ ఉపచారాద్ అదోషః" అన్నారు. అంటే ఐశ్వర్యం - సంపదలు అచేతనాలైనప్పటికీ, జ్ఞానం లేనివైనప్పటికీ వాటిని చేతన ప్రాణులవలే సంబోధించటం దోషంకాదు అన్నారు. ఇంతేగాక, వేదశాస్త్రాలలోనూ అక్కడక్కడ ఇటువంటి ప్రయోగాలు కనబడతాయి. (పంచ మహా యజ్ఞవిధిః పరిశిష్టంలో ఈ సూక్త భాష్యం ఉంది. "దయానందీయ లఘు గ్రంథ సంగ్రహం" శతాబ్ది సంస్కరణం. 360వ పేజి చూడగోరుచున్నాను.) దయానంద మహర్షి వ్రాసిన మరొక అర్థాన్నే నేను సరళంగా పై సరళార్థంలో వ్రాశాను.

O Jataveda Bhagvan ! I invoke that Laxmi who is embodiment of Sri (Ishwarya) and whose Glory shines like splendour of the Moon in all the Worlds, who is Noble and who is worshipped by Devas. I take refuse at her feet, who abides in the Lotus; By her Grace let the Alakshmi (in the form of Evil, Distress and Poverty) within and without be Destroyed. (5).

ఓం ఆదిత్యవర్ణే తపసోఽధి జాతో, వనస్పతి స్తవ వృక్షోఽథ బిల్వః ।
తస్య ఫలాని తపసా నుదన్తు, మా యాన్తరా యాశ్చ బాహ్యా అలక్ష్మీః॥ **(6)**

<u>వాక్యార్థం : ఆదిత్యవర్ణే తపసః+అధిజాతః</u> = ఆదిత్యునివలె స్వయం ప్రకాశకుడవైన ఓ జాతవేదా! నీ అద్భుతమైన తపస్సుతో (సామర్థ్యంతో) ఉద్భవించిన ఈ విశ్వ సృష్టి

<u>వనస్పతి+తవ వృక్షః + అథ బిల్వః</u> = వనానికి పతివలె భాసించు ఈ సృష్టిరూప బిల్వ వృక్షం వికసించి జీవులకు ఎన్నెన్నో ఫలాల నిచ్చుచున్నది.

<u>తస్య ఫలాని తపసా నుదన్తు</u> = బిల్వఫలాలు ఆదిత్య తాపంతో ఎండి భూమిపై రాలునట్లు సృష్టియంతా ప్రళయంగా మారిపోతున్నది. ఇట్లే మరల సృష్టి ప్రళయాలు జరుగుచున్నాయి.

<u>మాయా+అంతరాయః+చ బాహ్యా అలక్ష్మీః</u> = ఓ దేవా! ప్రపంచ అనిత్యత్వాన్ని గుర్తించి నేను మాయకు వశుడను కాకుందునుగాక. నాలోగల ఛల కపట అవిద్యా అలసత్వాది అలక్ష్ములను – పాపీలక్ష్ములను నీ జ్ఞానమయ తపస్సుతో ఎండించి రాల గొట్టుము. నానుండి దూరం చెయ్యుము.

<u>తాత్పర్యం</u> : ఆదిత్యునివలె స్వయం ప్రకాశకుడవైన ఓ జాతవేద! పరమేశ్వరా! నీ జ్ఞానమయ తపస్సువలన నీ సూక్ష్మప్రకృతినుండి ఈ ప్రపంచరూప బిల్వవృక్షం జనించుటయు, కాలక్రమమున నశించుటయు- ప్రళయమొందుటయు జరుగుచున్నది. సామాన్య బిల్వవృక్షఫలములు కూడా సూర్యతాపంచే ఎండి క్రిందపడును. అట్లే ఓ దేవ! నాలోని అవిద్యా ఆలస్య ఛల కపటాదులైన అలక్ష్మిని - పాపీలక్ష్మిని నీజ్ఞానతాపంతో దూరం చేయుము.

<u>వివరణ</u> : మన ఆధ్యాత్మిక శాస్త్రాలు సృష్టిని అశ్వత్థవృక్షంతో పోలుస్తాయి. అట్లని అది అశ్వత్థవృక్షం (రావిచెట్టు) కాదు. అ+శ్వ+త్థమ్ = రేపటివరకు ఇట్లే ఉండనిది. అనిత్యమైనదని భావం. అట్లే, ఈ మంత్రం సృష్టిని బిల్వవృక్షంతో పోలుస్తున్నది. బిల్వవృక్షం అంటే మారేడు చెట్టు. ఈ వృక్షమంతా ఔషధగుణాలను కలిగి ఉంటుంది. మనలోని ఛలకపట అవిద్యాది అలక్ష్ములను వేద జ్ఞానంతో పోగొట్టుకోవాలి. లక్ష్ములు సంపాదించుకోవటం ఎంత అవసరమో, అలక్ష్ములను పోగొట్టు కోవటం అంతే అవసరం.

బిల్వం అంటే ఖండఖండాలుగా చేయతగినదని అర్థం. ఈ సృష్టిలోని పదార్థాలన్నీ అణువుల కలియికతో ఏర్పడినవే కదా! మరల మనం వాటిని విడగొట్టవచ్చు కదా! అందుకనే ఈ ఋషి సృష్టిని బిల్వవృక్షం అంటున్నాడు. 'వృక్షం' అనే పదములోనూ ఇట్టి అర్థమేవుంది. (వృశ్చతేః ఇతివృక్షః) - వ్రయ్యలుగా - ముక్కలుగా చేయగలిగినది కాన వృక్షమనే పేరు కలిగిందంటారు వ్యాకరణ విద్వాంసులు.

O Swayam Prakashaka Parameshwara ! Invoke for me that Lakshmi, who is colour of the Sun and born of Tapas; that Tapas which is like Huge sacred Bilwa tree. Let the Fruit of that Tree of Tapas drive away the Delusion and Ignorance within and that Alakshmi outside.

*(Aditya Varna represents Swayam Prakash i.e. God. Bilwa Tree represents Creation. ALakshmi means Poverty)* (6)

ఓం ఉపైతు మాం దేవ సఖః, కీర్తిశ్చ మణినా సహ ।
ప్రాదుర్భూతోఽసి రాష్ట్రేఽస్మిన్, కీర్తిం వృద్ధిం దదాతు మే॥ (7)

<u>వాక్యార్థం : ఉపైతు మాం దేవ సఖః కీర్తిః +చ మణినా సహ</u> = ఓ దేవసఖా । నీవు

దేవతలకు – విద్వాంసులకు, జ్ఞానులకు, యోగులకు సదా సఖుడవు. ఆప్త మిత్రుడవు. అట్టి నీవు నాకును సఖుడవై నన్ను కాపాడు. అందువలన నేను గొప్పకీర్తిని, అనేక మాణిక్యాది సంపదలను పొందుదునుగాక!

ప్రాదుర్భూతః +అసి రాష్ట్రే +అస్మిన్ = నీ అఖండరాజ్యమగు ఈ విశాల విశ్వంలో ప్రాదుర్భూతుడవైనట్లే మా యందును ప్రాదుర్భూతుడవు కమ్ము.

కీర్తిం+వృద్ధిం దదాతు మే = మాకు కీర్తిని, వృద్ధిని కలిగించుము.

తాత్పర్యం : ఓ దేవసఖా! దివ్యగుణములుగల విద్వాంసులకు, యోగులకు, పరోపకారపరులకు నీవు సదా మిత్రుడవు. అట్టి నీవు ఐశ్వర్యంతో, కీర్తితో నా చెంతకు రమ్ము. నీ యఖండ రాజ్యమగు ఈ విశ్వంలో ప్రాదుర్భూతుడవైనట్లే నా హృదయాంతరంగంలో ప్రకటితుడవై సద్గుణాలతో నన్ను వృద్ధిపరచి, కీర్తిమంతుని చేయుము.

వివరణ : పరమేశ్వరుడు ప్రాణులన్నిటిపైనా సమాన ప్రేమ, కరుణ కలిగి ఉంటాడు. ఆర్థిక, ఆరోగ్య ఇబ్బందులు మన పూర్వజన్మకర్మల ఫలితంగా కలుగుచున్నవేకాని దేవుడు చూపే పక్షపాతంవల్ల కాదు. అతడు దేవసఖుడు. మంచిపనులు చేసేవారిని దేవతలనీ, చెడుకార్యాలు చేసేవారిని దానవులనీ – రాక్షసులనీ అంటారు. మనం సదా మంచి పనులు చేస్తూ దేవతలం కావాలి. దేవునికి మిత్రులం కావాలి.

O Dearest God Friend! Invoke for me that Laxmi, By whose presence will come near me that companions of the Devas along with Glory (Inner Prosperity) and various Jewels (Outer Prosperity). And I will be re-born in the kingdom of Sri (Signifying Inner Transformation towards purity) which will grant me Inner Glory and outer Prosperity. (7)

ఓం క్షుత్పిపాసామలా జ్యేష్ఠా అలక్ష్మీర్నాశయా మ్యహమ్ ।
అభూతి మసమృద్ధిం చ, సర్వాం నిర్ణుద మే గృహాత్ ॥ (8)

వాక్యార్థం : క్షుత్పిపాసామలా జ్యేష్ఠా అలక్ష్మీర్ +నాశయామి+అహమ్ = నేను ఆకలి దప్పికలతో కూడిన మలినమైన అలక్ష్మిని – దుర్భర దారిద్ర్యాన్ని ముందుగా నశింపచేయ పూర్ణప్రయత్నం చేయుదును గాక! హే జాతవేదా! నన్ను కరుణించుము.

అభూతం+అసంమృద్ధిం చ సర్వం = సమస్త అభాగ్యాన్ని అభావాన్ని

<u>నిర్ణుద మే గృహాత్</u> = నా గృహంనుండి దూరమొనర్చి నన్ను కాపాడుము.

<u>తాత్పర్యం</u> : హే పరమేశ్వర! ఆకలి దప్పికలతో మలినమైన ఈ దుర్భర దరిద్రరూప అలక్ష్మిని దూరమొనర్చ నేను పూర్ణ పురుషార్థం చేయుదును. దయతో ఈ దారిద్ర్యాన్ని, అభావాన్ని నా గృహంనుండి దూరమొనర్చి నన్ను కాపాడుము.

<u>వివరణ</u> : మానవుడు పూర్ణప్రయత్నంచేసి తాను తనవారి ఆకలిదప్పులను, దరిద్ర్యాన్ని పోగొట్టుకోవాలి. అనంతరం పై విధంగా ప్రార్థన చెయ్యాలి అని భావం.

O God ! Kindly invoke for me that Laxmi, whose presence will destroy Hunger, Thirst and Impurity associated with her elder sister Alakshmi . And drive away the wretchedness and Ill - fortune from my House.

ఓం గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ।
ఈశ్వరీం సర్వభూతానాం, తామిహోపహ్వయే శ్రియమ్ ॥ (9)

<u>వాక్యార్థం : గంధద్వారాం దురాధర్షాం</u> = హే పరమేశ్వరా! సుగంధద్వార యుక్తయు జయించనలవికానిది, అవమానముల పాలుగాకుండా రక్షించేది

<u>నిత్యపుష్టాం కరీషిణీమ్</u> = సర్వదా పుష్టినిచ్చేది, సకలము పరిపూర్ణంగా కలది

<u>ఈశ్వరీం సర్వభూతానాం</u> = సర్వప్రాణులకు ఈశ్వరియు, నాయకురాలును అగు

<u>తాం+ఉపహ్వయే శ్రియం</u> = అట్టి శ్రీలక్ష్మిని మాకు ఇప్పుడు ఇక్కడనే ప్రసాదింపుము.

<u>తాత్పర్యం</u> : హే జాతవేద! పరమేశ్వర! సుగంధద్వార యుక్తయు, అవమానముల పాలుగాకుండ రక్షించునదియు, నిత్యము పుష్టినొసంగునదియు, సర్వప్రాణులకు ఈశ్వరియు, నిత్యసుఖదాయియు నగు లక్ష్మిని (ఐశ్వర్యాన్ని) నే నెల్లప్పుడు రక్షించ యత్నింతును. ఓ దేవా! అట్టి శక్తిని నాకు ప్రసాదింపుము.

<u>వివరణ</u> : పిసినారి (కంజూషి) తనాన్ని విడిచి మనం చక్కగా తిని, మరికొందరికి పెట్టాలి. తగిన రక్షణ ఏర్పాట్లుగల మంచి యింటిని ఏర్పాటు చేసుకోవాలి. కనీస అవసరాలనన్నిటిని తీర్చుకోవాలి. మనకు సుఖాన్ని ఇవ్వని డబ్బు ఉండి ఎందుకు?

O God Jataveda ! Invoke for me that Laxmi, who is the source of All Sweet odours, who is difficult to approach, who is always filled with Abundance (ample) and leaves a residue Abundance (more than enough)

wherever she reveals herself, who is the ruling power in All Beings. Oh Jataveda! Please Invoke Her here, who is the Embodiment of Sri (Ishwarya) (9).

ఓం మనసః కామ మాకూతిం వాచః సత్య మశీమహి ।
పశూనాం రూప మన్నస్య, మయి శ్రీః శ్రయతాం యశః ॥ (10)

వాక్యార్థం : మనసః కామమ్+ఆకూతిం వాచః+సత్య మశీమహి = నీ కృపవలన ధర్మబద్ధమైన కోరికలను, మానసిక ప్రసన్నతను, సత్యభాషణాయుక్త వాణిని మేము పొందుదుముగాక!

పశునాం రూపమ్+అన్నస్య = సుందరమైన గో అశ్వాది సంపదలను, ప్రీతికరమైన అన్నమును నాకు ప్రసాదింపుము.

మయి శ్రీః శ్రయతాం యశః = పుష్కలమైన ధనమును, గొప్ప కీర్తిని నాకు ప్రాప్తింప చేయుము.

తాత్పర్యం : హే ఈశ్వర! నీ కృపవలన చిత్త ప్రసన్నత కలిగించు కోరికలను, సత్య భాషణాత్మకమైన వాణిని, ఆత్మజ్ఞానాన్ని నేను బొందుదునుగాక! సుందరమైన గో అశ్వాది పశుసంపదను, ప్రీతికరమైన అన్నాన్ని పొందుదునుగాక! నీ అనుగ్రహమున సదా నాకు ఐశ్వర్యము, కీర్తి లభించునుగాక!

వివరణ : మనిషికి కోరికలు ఉండవచ్చుకాని అవి ధర్మబద్ధమైనవిగా ఉండాలి. మనస్సును సదా ఉత్సాహంగా ప్రసన్నంగా పెట్టుకోవాలి. దొరికిన వాటితో తృప్తిపడాలి. "యల్లభసే నిజకర్మోపాత్తం విత్తం తేన వినోదయ చిత్తమ్" అన్నట్లు ఉండాలి జీవితం. గో అశ్వాది పశువులను కొన్నిటిని పొందగలగాలి. పరోపకారానికి కొంత ఖర్చుపెట్టి కీర్తిని పొందాలి.

Oh God ! Jataveda ! Invoke for me that Lakshmi, for whom my Heart Truly yearns and to whom my speech truly tries to reach, By whose presence will come cattle, Beauty and Food in my life as (External) Prosperity and who will Reside (Reveal) in me as (Inner) Glory of Sri (Ishwarya) (10).

ఓం కర్దమేన ప్రజాభూతా, మయి సంభ్రమ కర్దమ ।
శ్రియం వాసయ మే కులే, మాతరం పద్మమాలినీమ్ ॥ (11)

<u>వాక్యార్థం : కర్దమేన ప్రజాభూతా</u> = ఓ జాతవేద! నీవు సృజించిన ఐశ్వర్యలక్ష్మిని నేను పురుషార్థంతో పొందుదును గాక!

<u>మయి సంభ్రమ కర్దమ</u> = దానిని పొందుటకు కేవలం నా పురుషార్థం సరిపోదు. నీ కృపయు అవసరమే. అంతర్యామివైన నీవు సదా నన్ను ప్రేరేపించుచుండుము.

<u>శ్రియం వాసయ మే కులే</u> = నా కులంలో, కుటుంబంలో సిరిసంపదలు స్థిరంగా వసింపచేయుము.

<u>మాతరం పద్మమాలినీమ్</u> = పద్మమాలాలంకృతయైన సౌభాగ్యలక్ష్మి మా తల్లి కావాలి. ఆ తల్లి కృపా కటాక్షాదులు సదా మా కుటుంబంపై ప్రసరించాలి.

<u>తాత్పర్యం</u> : ఓ జాతవేదా! సర్వేశ్వరా! నీచే సృజింపబడిన ఈ సౌభాగ్యలక్ష్మిని పొంద నాకు ఉద్యమశీలతను ప్రసాదింపుము. అది కేవలం నా పురుషార్థంతోనే లభించదు. అందుకు నీ అనుగ్రహంకూడా అవసరం. కావున దయచేసి పద్మమువలె వికసింపజేయు తల్లివంటి లక్ష్మిని నాకు అనుగ్రహింపుము.

<u>వివరణ</u> : ఈ మంత్రంలోని 'కర్దమ' పదమునకు కర్దమ ప్రజాపతి (ఋషి) యని పౌరాణికులు అర్థం వ్రాశారు. కాని, ఐశ్వర్యం స్త్రీ కాదు. కర్దమ ఋషికి ఒక కుమార్తె కలిగి ఉండవచ్చును ఆమెకు లక్ష్మి యని నామకరణం జరిగియుండును. కాని, మహర్షి దయానందుల వారు 'కర్దమేన' అనే పదమునకు పురుషార్థమని అర్థం వ్రాశారు. కర్దమేన ప్రజాభూత = పురుషార్థంనుండి పుట్టిన ఐశ్వర్యం అని అర్థం వ్రాశారు. పురుషార్థం చేయకుంటే ఐశ్వర్యం పుట్టదు కదా!

ఇంతేగాక, ఈ లక్ష్మీసూక్త భాష్యంలో దయానంద మహర్షి 4, 5 చోట్ల ఐశ్వర్యాన్ని స్త్రీగా వర్ణించటం పెద్ద దోషం కాదన్నారు. "అచేతనేష్వపి చేతనవద్+ఉపచారాద్+అదోషః" అన్నారు. క్షీర సముద్ర మథనం నుండి లక్ష్మి పుట్టిందనే కథ వెనుకకూడా గూఢార్థం ఉంది. ఈశ్వరీయజ్ఞానమైన వేదాలే పాల సముద్రం. వాటిని ఎవరు ఎంతగా స్వాధ్యాయం చేసి, మనన చింతన పరిశోధనలు చేస్తారో వారికి అంతగా లక్ష్మి (సంపదలు) లభిస్తాయి. కామధేనువులు, కల్పవృక్షాలు కూడా లభిస్తాయి. కనుక కర్దమను - పురుషార్థాన్ని నమ్ముకోవాలికాని లక్ష్మీ విగ్రహాలు నిర్మించి పూజలు చేస్తే కాదు. నా రచన మన 'ఇతిహాసం' చదవండి. మరెన్నో విషయాలు తెలుస్తాయి.

O God Jataveda! Kindly give me strength and Zeal to obtain Mother Laxmi. Without your support and co-operation I can't get it. Please grant me enthusiasm and guide me to attain Sri (Ishwarya) (11).

ఓం ఆపః సృజన్తు స్నిగ్ధాని, చిక్లీత వస మే గృహే ।
ని చ దేవీం మాతరం, శ్రియం వాసయ మే కులే ॥ **(12)**

వాక్యార్థం : ఆపః సృజన్తు స్నిగ్ధాని = ఓ జాతవేద ఈశ్వర! నా ఆపః అంటే నా ప్రాణాలు, కర్మలు స్నిగ్ధములను - స్నేహయుక్త వస్తువులను సృజించును గాక!

చిక్లీత! వస మే గృహే = ఓ చిక్లీతుడా! పరమేశ్వర ప్రేరిత పురుషార్థమా! నీవు సదా మా గృహంలో వసించు. మాలో సోమరితనం రాకుండా కాపాడు. నీవు సర్వద్రవ్య వినిమాపకుడవు. నన్ను రక్షించు.

ని చ దేవీం మాతరం = మరియు నీవు దివ్య గుణయుక్తురాలవైన మా తల్లివి కూడా.

శ్రియం వాసయ మే కులే = అందుచే సదా నీవు మాయింట కొలువుండు.

తాత్పర్యం : ఓ చిక్లీతా! సర్వపదార్థ రచయితా! అంతర్యామివైన నీవు నాలో పురుషార్థాన్ని ప్రేరేపించు. ఓ దేవా! దివ్యగుణయుక్తమై నాకు గౌరవ ప్రతిష్టలను కలిగించు లక్ష్మిని సదా నా గృహమున వసింపజేయుము. హే జాతవేదేశ్వరా! నీ కృపవలన నా ప్రాణశక్తులు కర్మలు నాకు స్నేహయుక్తమైన వస్తు సంపదలను ప్రాప్తింప జేయును గాక!

వివరణ : పౌరాణిక పండితులు ఈ మంత్రంలోని 'ఆపః' పదమునకు నీరు అని అర్థం వ్రాసి మంత్రార్థాన్ని నీరసపరచారు. కాని, మహర్షి దయానందులవారు వేదవ్యాకరణాన్ని వెలుగులోనికి తెచ్చి ఈ మంత్రాన్ని మహోన్నత ప్రేరణ కలిగించే మంత్రంగా రూపొందించారు.

'ఆపః' అనే పదమునకు (ఆప్లృ - వ్యాప్తౌ) 'వ్యాపించేది' అని ధాత్వర్థం (Root meaning). నీటిలో వ్యాపించే గుణం ఉంది కనుక నీటిని కూడా 'ఆపః' అనవచ్చు. కాని, ప్రకరణాన్ని (Context ను) బట్టి, ఆ సందర్భానికి తగిన అర్థం చెప్పాలని వేదాంగాలు - శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్తాదులు చెబుతాయి. కొన్ని సందర్భాలలో ఈ పదము సర్వేశ్వరునికి వరిస్తుంది. ఉదా: శన్నో దేవీ రభిష్టయ ఆపో భవన్తు పీతయే......... అనే మంత్రలోని ఆపః పదం దేవునికి వర్తిస్తుందికాని

సామాన్య నీటికి కాదు. అభీష్టసిద్ధి, పూర్ణానందప్రాప్తి కలిగించేది పరమేశ్వరుడుకాని నీ రెట్లా కలిగిస్తుంది ? దానికి జ్ఞానం లేదు కదా! మన ప్రార్థన ఎలా వింటుంది?

ఇంతేగాక, వేదాలలోను, వైదిక సాహిత్యంలోనూ ప్రాణాలను, కర్మలను కూడా 'ఆపః' పదంతో పేర్కొనటం కనబడుతుంది. ప్రాణాలకు - వాయువులకు వ్యాపించే గుణం ఉంటుంది కదా! ఇంకా సూక్ష్మంగా పరిశీలిస్తే మన కర్మలు కూడా కార్యాలలో వ్యాపించి ఉంటాయి. అందుచేతనే దయానంద మహర్షి "ఆపః స్నిగ్ధాని సృజన్తు" అనే వాక్యానికి నా ప్రాణాలు, కర్మలు స్నేహయుక్త పదార్థాలను సృజించును గాక! అని అర్థం వ్రాశారు. మన కర్మలు, ఐశ్వర్యం మనకు మంచి స్నేహితులను ప్రసాదించేవి కావాలి కాని మనుష్యులను దూరం చేసేవి కాకూడదు.

'చిక్లీత' అనే పదమునకు పౌరాణికులు "శ్రీదేవి పుత్రుడవైన ఓ చిక్లీత" అని అర్థం వ్రాశారు. ఈ చరిత్ర ఏ పురాణంలోనిదో తెలియదు. చికీర్షత (తెలుసుకోవాలనే అభిలాష) వంటిదే చిక్లీత పదము. ఏదైనా 'కార్యాన్ని సాధించాలి' అనే పట్టుదలను, ఉత్సాహాన్ని చిక్లీత అంటారు. ఆ చిక్లీతనే మనకు పురుషార్థప్రేరణను కలిగిస్తూ ఉంటుంది. Encourage చేస్తూ ఉంటుంది. కనుక, దయానంద మహర్షి వ్రాసిన అర్థమే ఉన్నతంగా ఉంది. అట్టి చిక్లీత మన ఇంట్లోను, వంట్లోను కూడా ఉండాలంటున్నది పై మంత్రం. చిక్లీతగలవాడే ఐశ్వర్యవంతుడౌతాడు.

O Chikleeta! Creator of the Universe and Ishwarya! You are Omnipresent. Kindly encourage me to work hard and get ample prosperity. And give me same encouragement to my progency (members of my family). (12)

**ఓం ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం, సువర్ణాం హేమమాలినీమ్ ।**
**సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమావహ ॥ (13)**

వాక్యార్థం : ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం = హే జాతవేదేశ్వరా! పరస్పరప్రేమను పెంచేదీ, పుష్కరిణివలె శోభించేదీ, పుష్టిరూపిణీ,

సువర్ణాం హేమ మాలినీమ్ = బంగారు వర్చస్సుతో దేదీప్యమానంగా భాసించేదీ సువర్ణరత్న మణి మాణిక్యాది మాలలతో శోభిల్లేదీ,

సూర్యాం హిరణ్యయీం లక్ష్మీం= సూర్య తేజస్సుతో హిరణ్యమయియైన సులక్షణయుక్త ఐశ్వర్యలక్ష్మిని

జాతవేదః +మమ ఆవహ = ఓ జాతవేద భగవానుడా! నాకు ప్రసాదింపుము.

సరళార్థం = హే జాతవేద ఈశ్వరా! పరస్పర ప్రేమను పెంచునదియు, పుష్కరిణి వలె శోభిల్లునదియు, పుష్టిరూపిణియు, శోభనవర్ణయు, స్వర్ణరత్నాదిమాలా యుక్తయు, సూర్య తేజస్సుతో హిరణ్యమయియైన సులక్షణయుక్త ఐశ్వర్యలక్ష్మిని నాకు ప్రసాదించుము.

వివరణ : ఈ మంత్రంలో సిరిసంపదలను ఒక మనోహర స్త్రీగా కల్పన చేసి అట్టి లక్ష్మిని నాకు ప్రసాదింపుమని దేవుని ప్రార్థించటం జరిగింది. అంతేకాని, మనోహర రాకుమారిని ప్రసాదించమని కాదు.

O Almighty God Jataveda ! Invoke for me that Laxmi, who is like the Moisture (Figuratively representing Energy) which supports the performance of Activities; and who is encircled by Gold (Glow of the Fire of Tapas), who is like a Sun with a Golden Aura; O Jataveda! please Invoke that Laxmi for me.

*(Devi Laxmi in the form of a sun represents the fire of Tapas. This Fire is compared with the moisture within activities, the moisture figuratively signifying energy. The Fire of Tapas manifests as the Energy of Activities ) (13) .*

ఓం ఆర్ద్రాం యః కరిణీం యష్టీం, పింగలాం పద్మమాలినీమ్ ।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమావహ ॥ (14)

వాక్యార్థం : ఆర్ద్రాం యః కరిణీం యష్టీం = ఓ జాతవేద పరమేశ్వరా! స్నేహ శీలయు, సువర్ణాది ధాతుకారిణియు, యశస్కరియు,

పింగలాం పద్మమాలినీమ్ = పీతాది శోభనవర్ణయుక్తయు, పద్మమువలె వికసింప చేయునదియు,

చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం = (చది-ఆహ్లాదే) చంద్రునివలె ఆహ్లాదాన్ని కలిగించునదియు అయిన ఐశ్వర్యలక్ష్మిని

జాతవేదః+మమ+ఆవహ= ఓ జాతవేద భగవానుడా! నా చెంతకు చేర్చుము.

సరళార్థం : ఓ జాతవేద! స్నేహయుక్తయు, సువర్ణాది ధాతువులతో యశస్సు నిచ్చునదియు రథాలతో, నివాసస్థానాలతో, స్వర్ణస్తంభాలతో శోభిల్లునట్టియు, పింగళవర్ణయునగు రాజ్యలక్ష్మిని నాకు ప్రసాదింపుము.

వివరణ : పూర్వ మంత్రంలో వలెనే ఈ వర్ణన మనోహర స్త్రీని తలపింప చేస్తున్నది. కాని, అట్లుకాదు. ఐశ్వర్యమే అందరిని పరవశింప చేస్తుంది. అది అందమైన స్త్రీలను కూడా ఆకర్షిస్తుంది కదా!

పూర్వమంత్రంలో 'సూర్యాం' అనీ, ఈ మంత్రంలో 'చంద్రాం' అనీ ఐశ్వర్యలక్ష్మికి విశేషణాలు చేర్చబడ్డాయి. రెండూ యథార్థమే. అది సూర్యునివంటి తేజస్సును, చంద్రునివంటి ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. ఈ రెండూ మనకు అవసరమే.

ఈ రెండు మంత్రాలు ఐశ్వర్యలక్ష్మిని 'ఆర్ద్రాం' అంటున్నాయి. 'ఆర్ద్రత' అంటే తడసినది, చెమ్మగలది అని సామాన్యార్థం. ఆర్ద్రత అంటే భజన పాడేటప్పుడు దానిలోని భావం మన కళ్ళను చెమ్మగిల్ల చేస్తే అది గొప్ప భజన అవుతుంది. అట్లే మనకు ఐశ్వర్యలక్ష్మి ప్రాప్తించినపుడు ఆనందభాష్పాలు పొంగి ప్రవహిస్తాయికదా! సువర్ణ పింగలి వర్ణాలు (రంగులు) రెండూ ఐశ్వర్యసూచకాలే. మనోహరములే.

O Parameshwara! Invoke for me that Laxmi, who is like the moisture of Lotus Pond, which Nourishes a Soul (with her soothing Loveliness); and who is encircled by light yellow Lotuses, who is like a Moon with a Golden Aura; O Jataveda ! Please invoke that Laxmi for me.

*(Devi Laxmi in the form of a moon represents the transcendental Bliss and Beauty of Sri. This soothing Loveliness is compared with the moisture of a Lotus pond which Nourishes a Soul). (14)*

ఓం తాం మ ఆవహ జాతవేదో, లక్ష్మీ మనపగామినీమ్ ।
యస్యాం హిరణ్యం ప్రభూతం గావో, దాస్యో౽శ్వాన్
విందేయం పురుషానహమ్॥ **(15)**

వాక్యార్థం : తాం మే+ఆవహ జాతవేదః = ఓ జాతవేదా! సమస్త ఉత్పన్నమైన ప్రాణులను పదార్థాలను తెలిసినవాడా! నాకు అట్టి ఐశ్వర్యలక్ష్మిని ప్రసాదించు.

అది ఎలా ఉండాలంటే -

__లక్ష్మీమ్+అనపగామినీమ్__ = ఆ లక్ష్మి (ఐశ్వర్యం) నన్నెప్పటికీ విడిచిపోనిదిగా ఉండాలి.

__యస్యాం హిరణ్యం ప్రభూతం__ = అది సువర్ణ రత్న రజితాదులతో కూడినదీ, ప్రభూతంగాను (లెక్కపెట్టలేనంత ఎక్కువగాను) ఉండాలి.

__గావః దాస్యః +అశ్వాన్__ = పుష్కల క్షీరాలను ఇచ్చు గోవులు కలదిగాను, అనుకూల వర్తనులైన దాసదాసీ జనం కలదిగాను, వేగవంతములైన అశ్వాలు కలదిగాను ఉండాలి.

__విందేయం పురుషాన్ +అహమ్__ = మరియు బలమైన సైనికశక్తికలదిగాను ఉండాలి. అట్టి సమగ్ర చక్రవర్తిరాజ్యలక్ష్మిని నాకు ప్రసాదించు. నీవే మాకు తల్లివి, తండ్రివి, గురువు, దైవము.

__తాత్పర్యం__ : ఓ జాతవేదేశ్వరా! నా ప్రార్థనను మన్నించి పైన వర్ణించిన సులక్షణయుక్త సుఖ ప్రదాయినియగు లక్ష్మిని - ఐశ్వర్యమును నాకు ప్రసాదింపుము. హే పరమేశ్వరా స్వామిన్ ! నీ కృపవలన గో అశ్వ దాసదాసీజనములను, పెక్కురు సన్మిత్రులను, అపార స్వర్ణ రత్న రజితాదులను నేను పొందుదును గాక!

__వివరణ__ : ఈ మంత్రంలో ఐశ్వర్యం యొక్క పరాకాష్ఠ - ప్రపంచ ఏక ఛత్రాధిపత్య రాజ్యలక్ష్మి యొక్క వర్ణన ఉంది. ఇంతటి రాజ్యలక్ష్మిని పొంద మనం యోగ్యులమా? మనకు అట్టి అర్హత ఉందా? ఇది అత్యాశనేమో! ఆలోచించండి. ఎవరికి వారు ఈ ప్రార్థన చేస్తే దేవుడు ఎవరిని చక్రవర్తి చెయ్యాలి ? ఈ మంత్రంలోని 'అహం' పదము ఏక వచనంలో ఉన్నా దయానంద మహర్షి ఈ పదమునకు సామూహిక పదంగా నః = 'మాకు' గా అర్థం వ్రాశారు. చక్రవర్తి రాజ్యలక్ష్మి ఏ ఒక్కరిదికాదు. రాజ్యవాసులందరిదీ. ప్రభుత్వం ప్రజలది కదా! అట్లే, పూర్వం చక్రవర్తి రాజ్యం ప్రజలందరిదిగా ఉండేది.

ఇంతేగాక, సృష్ట్యాదినుండి మహాభారతకాలం వరకు మనదేశం ప్రపంచాన్నేలిన ఏకఛత్రాధిపతిగా ఉండేది. రఘువంశ కావ్యంలోనూ, మహాభారతంలోనూ పెద్ద పెద్ద రాజసూయ అశ్వమేధ యజ్ఞాలు జరిగినపుడు ప్రపంచదేశ రాజన్యులందరూ కప్పాలు చెల్లించినట్లు, అపార ధనరాశులు బహూకరించినట్లుగా చారిత్రిక వర్ణనలున్నాయి. మహాభారత యుద్ధంలోనూ ప్రపంచ దేశాలన్నీ పాల్గొన్నాయి. కొందరు కౌరవపక్షంలోనూ, కొందరు పాండవుల

పక్షంలోనూ చేరి యుద్ధాలు చేశారు.

మరల అటువంటి ఆర్యచక్రవర్తి మనదేశం కావాలని దయానంద మహర్షి కలలుగన్నారు. క్షత్రియులందరిని ప్రోత్సాహపరిచారు. ప్రేరణకలిగించారు. ముందు ఆంగ్లేయులతో పోరాడి పారద్రోలండన్నారు. తన వేదభాష్యంలో పెక్కుచోట్ల తమ అభిప్రాయాన్ని వ్యక్తపరచుటయేగాక, తన యోగసాధన అనంతరం స్వాతంత్ర్యం కోసం సర్వవ్యాపక సర్వేశ్వరుని నిత్యం ప్రార్థనలు చేశారు. ఆ దీనస్థితికి ఎన్నో రాత్రులు విలపించారు. నా రచన "స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు" చదవండి. మరెన్నో విషయాలు తెలుస్తాయి.

O Omnipresent God Jataveda! Invoke for me that Laxmi who does not leave me. By whose Golden touch I will obtain (i.e. Sri will be manifested as) abundant Cattle, Servants, Houses and Progeny.

*(Golden Touch represents the fire of Tapas, which manifests in us as the Energy of Effort, by the grace of Devi. Cattle, Horses etc are external manifestation of Sri Following the effort). (15)*

ఓం యః శుచిః ప్రయతో భూత్వా జుహుయాదాజ్య మన్వహమ్ ।
శ్రియః పంచ దశర్చం చ శ్రీకామః సతతం జపేత్ ॥ **(16)**

వాక్యార్థం : యః శుచిః ప్రయతః+భూత్వా = ఎవరు బాహ్యాభ్యంతరములందు శుచులై అత్యంత ప్రీతితో

జుహుయాద్+ఆజ్యమ్+అన్వహమ్ = పై మంత్రాలతో పరమేశ్వరుని ప్రార్థిస్తూ నిత్యం అగ్నిహోత్రంలో ఆవునేతితో ఆహుతులిస్తారో.

శ్రియః పంచ దశర్చం చ = లేదా పై 15 మంత్రాల లక్ష్మీసూక్తంతో సదా ప్రార్థన, ప్రయత్నాలు చేస్తుంటారో.

శ్రీకామః సతతం జపేత్ = అట్టివారందరికి కాలక్రమమున సిరిసంపదలు లభిస్తాయి. వారి ధర్మయుక్త కోరికలన్నీ నెరవేరతాయి.

తాత్పర్యం : ఎవర బాహ్యాభ్యంతరాలందు శుచులై అత్యంత ప్రీతితో పై మంత్రాలతో పరమేశ్వరుని ప్రార్థించుచూ ఘృతాదులతో అగ్నిహోత్రంలో ఆహుతులనిస్తారో అట్టివారికి పైన వర్ణించిన సిరిసంపదలు లభిస్తాయి. అర్థభావనతో పై పదునైదు మంత్రాలతో నిత్యం పరమేశ్వరుని ప్రార్థించు అనన్య భక్తులకును ఐశ్వర్యశ్రీ లభిస్తుంది. వారి ధర్మయుక్త కోరికలన్నియు నెరవేరతాయి.

వివరణ : మొదటి 15 మంత్రాలతో లక్ష్మీసూక్తం పూర్ణం అవుతుంది. ఆ మంత్రాల మహిమను, మహత్యాన్ని ఈ మంత్రం సూచిస్తున్నది. ముఖ్యంగా ఈ మంత్రం లక్ష్మీ సూక్తంతో ఆహుతులిస్తూ హోమం చెయ్యమంటున్నది. దానిని మనం 'వరలక్ష్మీ హోమం' అనవచ్చు.

హోమం - అగ్నిహోత్రం - యజ్ఞం అనే పేర్లతో పిలిచే దేవయజ్ఞం గురించి భగవద్గీత మూడవ అధ్యాయం అగ్నిహోత్రాన్ని చాల గొప్పగా కీర్తిస్తుంది. సృష్ట్యాదిలోనే ప్రజాపతియైన పరమేశ్వరుడు ప్రజలతో బాటే ఈ అగ్నిహోత్ర విధిని ఉపదేశించి, వీటిద్వారా మీమీ కోరికలను పొందండన్నాడు. ఇది కామధేను వన్నాడు. అందుకు తగిన మూలికలను, స్థాలీపాకాలను గో ఘృతాన్ని ఆహుతులుగా యిస్తే ఆ యా కోరికలు నెరవేరతాయన్నాడు. మరెన్నో యజ్ఞ ప్రయోజనాలు ఉపదేశించాడు. వాటిని అక్కడ (భ.గీ.- 3వ అ.10 నుండి 16వరకు) చదవండి.

పరమేశ్వరీయ జ్ఞానమైన యజుర్వేదం హోమాన్ని 'వసువు' అంటుంది. ఇది ఒక పెద్ద సంపద, ఐశ్వర్యం అంటుంది.

**ఓం వసోః పవిత్రమసి శతధారం వసోః పవిత్రమసి సహస్రధారమ్ ।**
**దేవస్త్వా సవితా పునాతు వసోః పవిత్రేణ శతధారేణ సుప్త్వా కామ దుక్షః ॥**

**- యుజుర్వేదం (1-3)**

**యజ్ఞో వై వసుః** (శతపథ బ్రాహ్మణం -1-5-4-9). వసువు = అగ్నిహోత్రం ఒక పవిత్రకర్మ. అది శత విధాల ప్రయోజనకారి. అంతేకాదు. వెయ్యి విధాల కోరికలను నెరవేరుస్తుంది. సృష్టికర్తచే సృజింపబడిన - ఉపదేశింపబడిన అగ్నిహోత్రం ఒక దేవత. దీనితోనే మిగిలిన దేవతలన్నీ పూజింపబడతాయి. పవిత్రపరచబడతాయి. "ఓ జగదీశ్వరా! అట్టి ఈ యజ్ఞంతో మమ్ము పవిత్ర పరచుము. శతవిధాల పవిత్ర పరచుము. ఇది కామధుక్షువు. కోరికలను నెరవేర్చు కామధేనువు" అంటున్నది పై వేదమంత్రం. భగవద్గీత ఈ విషయాన్ని మరింత బల పరుస్తుంది. కనుక, మనం ఈ లక్ష్మీసూక్త మంత్రాలతో విశేష ఆహుతులిస్తే మన శరీరాలు పవిత్రమై మంచి ఆరోగ్యం లభిస్తుంది. ఉత్సాహం, ప్రేరణ కలుగుతాయి. బలవీర్యాలు బలపడతాయి. అట్టి శరీరంతో మనం పూర్ణపురుషార్థం చేస్తే పై మంత్రాలలో సూచించిన కోరికలన్నీ నెరవేరుతాయి. జీవితం సుఖంగా ఆనందంగా తృప్తిగా గడిచి పోతుంది. అగ్ని హోత్రం చేయ వీలుపడనివారు అర్థభావనతో పై మంత్రాలను జపించవచ్చు - పఠించవచ్చు.

Those who after Becoming bodily clean Devotionally Disposed perform sacrificial offerings with Cow Ghee (or Pure Ghee) day after day in Havan Kund (Agnihotra) Or by reciting the above Fifteen verses (Mantras of Lakshmi Suktam will have their longing for Sri fulfilled by the Grace of Omnipresent and Omniscient God Jataveda). (16)

## ఉపసంహారం (CONCLUSION)

ప్రియ పాఠకులారా !

మీ రింతవరకు ఋగ్వేద పరిశిష్టంలోని ఒక అజ్ఞాత మహర్షి వ్రాసిన లక్ష్మీ సూక్తానికి నా వైదిక వైజ్ఞానిక వివరణ చదివారు. దీని సారాంశమేమంటే – వివిధసంపదలను ఐశ్వర్యాలను ఒక స్త్రీ దేవతగా కల్పనచేసి వర్ణించారు. ఆ దేవతకు 'లక్ష్మి' అని పేరు పెట్టారు. అట్టి లక్ష్ములను నాకు లేదా మాకు ప్రసాదించమని జాతవేద భగవానుని ప్రార్థించారు. ఇక్కడ జాతవేదుడంటే సర్వవ్యాపక సర్వేశ్వరుడే. సంపదలన్నీ ఆయన సృజించినవే కనుక ఆయననే మాకును ప్రసాదించమని ప్రార్థించారు.

అయితే సంపదలను కోరేవారు అందుకు తగినట్లు శ్రమించాలని సూచించారు. ఆ విధంగా శ్రమించటానికి తగిన బుద్ధిని, శక్తిని, యుక్తిని, ఉత్సాహాన్ని, ప్రేరణను మాకు ప్రసాదించమని జాతవేద భగవానుని ప్రార్థించారు. ఆ జాతవేదుడు ఎక్కడో దూరంగా లేడు. మనలోనే అంతర్యామిగా ఉన్నాడు. కనుక నిద్ర లేవగానే పడకపైననే కూర్చుండి ఋగ్వేద సప్తమ మండలంలోని 4వ ప్రాతః స్మరణ సూక్తాన్ని అర్థభావనతో పఠించండి. అంతర్యామిని మనసారా ప్రార్థించండి. త్వరలో ప్రాతః స్మరణ సూక్తం (భగసూక్తం) విడుదలౌతుంది.

వేదాలలో వివిధ ఐశ్వర్యాలను – వివిధ లక్ష్ములను కోరుతూ ప్రార్థించే మంత్రాలు చాలానే ఉన్నాయి. అందుకు మనవంతు చేయవలసిన ప్రయత్నాలు వివరింపబడ్డాయి. కనుక ఐశ్వర్యాలను, అభ్యుదయాలను కోరేవారంతా వేదస్వాధ్యాయం చెయ్యండి. రోజుకు ఒక మంత్రాన్నైనా స్వాధ్యాయంచేసి, మనన చింతనలు చెయ్యండి. ఇందుకు మా గురువుగారు పం.గోపదేవ శాస్త్రి గారు తెలుగులో అనువదించి ప్రచురించిన "వైదిక వినతి" చాలా ఉపకరిస్తుంది. అందువలన మీకు గొప్పమేలు కలుగుతుంది. అభ్యుదయంతో బాటు నిః శ్రేయసమార్గం (ముక్తి మార్గం) కూడా గోచరిస్తుంది. ఇందుకు మేము శక్తికొలది నెల నెలా 4 పేజీలుగల కరపత్రాలను ముద్రించి వితరణ చేస్తున్నాము. వాటిని శ్రద్ధగా చదివి మననం చేసినా మీకు అసలైన వేదార్థం గోచరిస్తుంది.

అస్తు – మనం అట్లే చేయుదుము గాక!

**'వయం స్యామ పతయో రయీనామ్'**

ఓ౩మ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

# అథ లక్ష్మీ సూక్తమ్

(ఋగ్వేద పరిశిష్టస్థమ్)

ఓం హిరణ్యా వర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజామ్
చన్ద్రాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమా వహ॥
ఓం తాం మ ఆ వహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్
యస్యాం హిరణ్యం విందేయం, గామశ్వం పురుషానహమ్
ఓం అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రమోదినీమ్ ।
శ్రియం దేవీ ముప హ్వయే, శ్రీర్ మాదేవీర్ జుషతామ్
ఓం కాంసోస్మితాం హిరణ్య ప్రాకారా, మార్ద్రాం జ్వలన్తీం
తృప్తాం తర్పయన్తీమ్ । పద్మే స్థితాం పద్మవర్ణాం
తామిహోపహ్వయే శ్రియమ్ ॥
ఓం చన్ద్రాం ప్రభాసాం యశసా జ్వలన్తీం శ్రియం లోకే
దేవజుష్టాముదారామ్ । తాం పద్మనేమిం శరణ మహం ప్రపద్యే
అలక్ష్మీర్మే నశ్యతాం, త్వాం వృణోమి ॥
ఓం ఆదిత్యవర్ణే తపసోఽధి జాతో, వనస్పతి స్తవ వృక్షోఽథ బిల్వః ।
తస్య ఫలాని తపసా నుదన్తు మా, యాన్తరా యాశ్చ బాహ్యాఅలక్ష్మీః ॥
ఓం ఉపైతు మాం దేవసఖః, కీర్తిశ్చ మణినా సహ ।
ప్రాదుర్భూతోఽసి రాష్ట్రేఽస్మిన్, కీర్తిం వృద్ధిం దదాతు మే ॥
ఓం క్షుత్పిపాసామలా జ్యేష్ఠా అలక్ష్మీర్నాశయా మ్యహమ్ ।
అభూతి మ సమృద్ధించ, సర్వాం నిర్ణుద మే గృహాత్ ।
ఓం గంధ ద్వారాం దురాధర్షాం, నిత్యపుష్టాం కరీషిణీమ్ ।
ఈశ్వరీం సర్వభూతానాం తామి హోపహ్వయే శ్రియమ్ ॥
ఓం మనసః కామ మాకూతిం, వాచః సత్య మశీమహి ।
పశూనాం రూప మన్నస్య, మయి శ్రీః శ్రయతాం యశః ॥
ఓం కర్దమేన ప్రజా భూతా, మయి సంభ్రమ కర్దమ ।
శ్రియం వాసయ మే కులే, మాతరం పద్మమాలినీమ్ ॥
ఓం ఆపః స్రజన్తు స్నిగ్ధాని, చిక్లీత వస మే గృహే ।
ని చ దేవీం మాతరం, శ్రియం వాసయ మే కులే ॥
ఓం ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం, సువర్ణాం హేమమాలినీమ్ ।
సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమావహ ॥
ఓం ఆర్ద్రాం యః కరిణీం యష్టిం, పింగలాం పద్మమాలినామ్ ।
చంద్రాం హిరణ్యయీం లక్ష్మీం, జాతవేదో మమావహ ॥
ఓం తాం మ ఆవహ జాతవేదో, లక్ష్మీ మనపగామినీమ్ ।
యస్యాం హిరణ్యం ప్రభూతం గావో, దాస్యోఽశ్వాన్ విందేయం
పురుషానహమ్ ॥
ఓం యఃశుచిఃప్రయతో భూత్వా జుహుయాదాజ్య మన్వహమ్ ।
శ్రియః పంచ దశర్చం చ, శ్రీకామః సతతం జపేత్ స్వాహా ॥

(ఇదం లక్ష్మై ఇదం న మమ)




## సృష్టికర్త ఆదేశం :

**ఓం ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే దేవాన్ యజ్ఞేన బోధయ ।**
**ఆయుః ప్రాణం ప్రజాన్ పశూన్ కీర్తిం యజమానం చ వర్ధయ ॥**

- ఋగ్వేదం(1-40-1), యజు. (34-56), అథర్వ(19-63-1).

వాక్యార్థం :

ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే = ఓ వేదవిద్వాంసులారా! అలసత్వాన్ని విడిచి జాగరూకులు కండు.

దేవాన్ యజ్ఞేన బోధయ = పృథివ్యాపస్తేజో వాయురాకాశాది ముప్పది మూడు దేవతలను యజ్ఞక్రియద్వారా తృప్తిపరుచుడు. వాటిని సంస్కరింపుడు - శుద్ధిచేయుడు.

ఆయుః ప్రాణం ప్రజాం పశూన్ కీర్తిం = దీర్ఘమైన ఆయువును, బలమైన ప్రాణశక్తిని, ఉత్తమసంతానాన్ని, గో అశ్వాది పశుసంపదలను, సత్కర్మలు చేయించి సత్కీర్తిని,

యజమానంచ వర్ధయ = యజమానికి - యజ్ఞకర్తకు కలిగించుడు. ఉన్న వాటిని వృద్ధిచేయుడు.

సరళార్థం : ఓ వేదవిద్వాంసులారా! అలసత్వాన్ని విడిచి జాగరూకులు కండు. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్య చంద్ర నక్షత్రాలు మొదలగు 33 దేవతలను అగ్నిహోత్ర క్రియద్వారా సేవించండి. వాటిని సంస్కరించండి - శుద్ధిచేయండి. తద్వారా యజ్ఞకర్తకు దీర్ఘమైన ఆయువును, బలమైన ప్రాణశక్తిని, ఉత్తమ సంతానాన్ని, గో అశ్వాది పశుసంపదలను, సత్కర్మలను చేయించి సత్కీర్తిని కలిగించుడు. వాటిని వృద్ధి చేయుడు.

O master! of Vedic speech, Please rise to excellence and inspire awakening in the men of wisdom and virtue through the performance of Yajna. You strengthen the performer Yajmana and give aid to life, vital breath, progeny, cattle and fame.

Gayatri Series : 64

VISHUDHA LAXMI SUKTAM....

Rs. 20/-



<u>భద్రమైన లక్ష్మి నీ వాక్కులోనే ఉంది</u>

ఓం సక్తుమివ తితఉనా పునన్తో యత్ర ధీరా మనసా వాచమక్రత ।
అత్రా సఖాయః సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్ నిహితాధి వాచి ॥

– ఋగ్వేదం (10-71-2).

<u>వాక్యార్థం :</u>

<u>సక్తుమ్</u>+<u>ఇవ తితఉనా పునన్తః</u> = జల్లెడతో సత్తుపిండిని (లేదా గోధుమ పిండిని) జల్లెడపట్టి వాడుకొనునట్లుగా

<u>యత్ర ధీరా మనసా వాచమ్</u>+<u>అక్రత</u> = ధీరులు (బుద్ధిమంతులు) తమ వాక్కులను (మాటలను) బుద్ధి అను జల్లెడతో జల్లెడపట్టి వ్యర్థములు, కరువులు, అసత్యములు నైన వాక్కులను తొలగించి మృదుమధుర సత్యవాక్కులను పలుకుదురు.

<u>అత్రా సఖాయః సఖ్యాని జానతే</u> = అట్టి వాక్కులతోనే సన్మిత్రులను, సద్భావనలను, అనుచరులను పొందగలరని వారెరుగుదురు.

<u>భద్రా</u>+<u>ఏషామ్ లక్ష్మీర్</u>+<u>నిహితా</u>+ <u>అధి వాచి</u> = భద్రమైన లక్ష్మి – ఐశ్వర్యం మన వాక్కులోనే నిహితమై ఉంది.

<u>సరళార్థం</u> = జల్లెడతో సత్తుపిండిని జల్లెడపట్టి వాడుకొనునట్లుగా ధీరులు తమ వాక్కులను బుద్ధితో జల్లెడపట్టి వ్యర్థకాలైన అసత్యవచనాలను తొలగించి మృదుమధుర సత్యవాక్కులనే పలుకుతారు. అట్టి వాక్కులతోనే వారు సన్మిత్రులను అనుచరులను పొంది ఎన్నెన్నో సంపదలను పొందుతారు. భద్రమైన లక్ష్మి వాక్కులోనే నిహితమై ఉంది సుమా !

Published by :

GAYATRI ASHRAM TRUST

12-10-586/6, Arya Samaj Medibavi, Seethaphalmandi,
Secunderabad - 500 061. TELANGANA.